

సర్వార్థ సంక్షేమ సమితి ద్వారా14-9-95 న చండీ హవనము పూర్ణాహుతి
శ్రీ విశ్వంజీ కీ.శే. పెళ్ళకూరు రామచంద్రారెడ్డి, ఇఫ్కో ఛైర్మన్
మరియు పి.వి. మనోహరరావు దంపతులు



14-9-95 న ఢిల్లీలోని శృంగేరీ శంకరమఠంలో
"చండీ హవనము"పి.వి. మనోహరరావు దంపతులు నిర్వహించుట

# విశ్వప్రకాశం

## ఆధ్యాత్మికమాసపత్రిక

శ్రీయువనామ సం॥ దసరా, దీపావళి వార్షికోత్సవ ప్రత్యేక సంచిక

అక్టోబర్ - నవంబర్ 1995

సంపుట్ : 1 సంచిక . 12 వెల రూ



*ప్రకాశకులు*
సర్వార్థ సంక్షేమ సమితి,
501, ప్రదీప్ అపార్ట్‌మెంట్స్,
గాంధీనగర్, హైదరాబాద్.

*ఈ సంచికలో ........*



**ముఖచిత్రం:** శ్రీమహాలక్ష్మి

# శుభాకాంక్షలు

*పి. వి. మనోహర రావు.*

విశ్వప్రకాశం పాఠక మహాశయులకు, బంధుమిత్రులకు శ్రేయోభిలాషులకు యువనామ సంవత్సర విజయ దశమి మరియు దీపావళి శుభాకాంక్షలు తెలియ చేయుచున్నాను. మా సర్వార్థ సంక్షేమ సమితి. అనేక ఇతర కార్యక్రమములతో పాటు విశ్వ ప్రకాశం నెలనెలాప్రచురిస్తు. నెలనెలా మీకు అందిస్తున్నది. ఈమధ్యన సెప్టెంబరు 14, 15, 16, 17 తేదీల్లో ఢిల్లీలో, మానవ విలువలపై చాలాపెద్దయెత్తున సదస్సు నిర్వహింపబడినది. గౌ. కె. ఆర్. నారాయణన్, ఉపరాష్ట్రపతిగారు ప్రారంభింపగా, గౌ. పి. వి. నరసింహారావు గారు, భారత ప్రధాని ముగింపు సమావేశములో పాల్గొన్న, కార్యక్రమాలు జయప్రదంగా ముగిసినవి. వాని వివరములు, ఈ సంచికలో "ఢిల్లీలో సర్వార్థ సంక్షేమ సమితి" యను శీర్షికలో వివరంగా తెలుపబడినవి.

ఈ ధార్మిక మాసపత్రిక, దాదాపు 400 దేవాలయాలకు 150 గ్రంథాలయాలకు, మరియు తెలిసిన బంధు మిత్రులకు కలిపి, దాదాపుగా 1000 ప్రతులు ప్రతి నెలా తపాలాద్వారా, పంపుచున్నాము. గత సెప్టెంబరు సంచికతో 'విశ్వ ప్రకాశం' ఒక యేడు పూర్తి చేసికొన్నది. ఈ సందర్భంగా, హైదరాబాద్‌లో వార్షికోత్సవము జరుపుకోబొతున్నదని తెలియ చెయుటకు సంతసించుచున్నాను. అంతే కాకుండా, అక్టోబరు, నవంబరు నెల సంచికలను కలిపి, గత యేటి మాదిరిగా ప్రత్యేక సంచికగా, పేజీలు పెంచి ప్రచురిస్తున్నాము. దేవాదాయకమీషనర్‌గారు ఈ పత్రిక కొనుగోలు చేయుటకు, అన్ని దేవాలయములకు కమేండేషన్ లేఖలు పంపినారు. ఈ పత్రికలోను. ఇది వరలోనూ దానిని యథాతథంగా ప్రచురించినాము. అయినా పది దేవాలయ E.O.గారలు మాత్రం 60/-రు.ల చందా పంపినారు. మిగతా 390 దేవాలయాల నుండి యేలాటిస్పందన రాలేదు. ప్రతినెలా పత్రిక మాత్రం వారికందుతుంది. ఆంధ్రప్రదేశ్‌లోని మొత్తం జిల్లా గ్రంథాలయ సంస్థలకు రెండు మూడు సార్లు లేఖల ద్వారా విన్నవించి, ఆయా జిల్లా గ్రంథాలయాల చిరునామాలు, ఆర్డర్లు పంపాల్సిందిగా కోరినాము. కాని ఒక వరంగల్, హైద్రాబాదు జిల్లాల గ్రంథాలయాలు మాత్రం లేఖలద్వారా ఆర్డర్లు పంపితే, వారికి ప్రతి నెలా ప్రతులు పంపుట జరుగుచున్నది. ఇక పోతే బంధు మిత్రుల సంఖ్య దాదాపుగా 500 సభ్యత్వం. అందులో ఒక వంద మంది సభ్యత్వం 60/-రు.లు. పంపియుండ వచ్చును. మిగతా 400 కాపీలు ఉచితంగానే వెడుతున్నవి

(Free Distribution). ఇది కాక "విశ్వప్రకాశం"కు పోషకులు, రాజ పోషకులు, మహారాజ పోషకులుగా గుర్తించి, 5,000/-, 10,000/-, 15,000/-రు.లు నిర్ణయించి, పత్రికలో ప్రకటించి, వ్యక్తిగతంగాను, పలువురిని అర్ధించుట జరిగినది. ఇరువురు, ముప్పురికాన్నా ఆ సంఖ్యయు మించలేదు - ఈ పరిస్థితిలో ప్రతి నెల ఏడెనిమిది వేలరూపాయిల ఖర్చు ఈ సంస్థకు భారమగుచున్నది. అలా భారమని పత్రికను అపుటకు సంకల్పించలేదు కాని పోస్టేజిటికట్లు, అడ్రసులు అతికించుశ్రమ ఇతరత్రా కొంతవ్యయం, తప్పని సరిగా తగ్గించుకొను ప్రయత్నంలో ఈ ప్రత్యేక సంచిక తర్వాత పాఠకులనుండి స్పందన యిప్పటికైనా లభించకుంటే అనగా కనీసం ఒక సం॥చందా 60/-రు లనైనా మీరు పంప లేకుంటే తదుపరి సంచిక ఆపివేయబడునని సవినయంగా మనవి చేయుచున్నాను.

ఈ కలికాలంలో యేమంచికార్యం తలపెట్టినా కార్యరూపందాల్చినా దాని విలువ గ్రహించుట అటుంచి నానాఅర్థాలు, నానా అపోహలు, నానారకాల అవగాహనలకు త్వరితంగా రావటం సహజసిద్ధమైనది. ఎవరేమనుకున్నా వారి మన్ననలకు చేయు కార్యక్రమాలు మాత్రం మావికావని కేవలం, సేవాభావంతోను, సమాజమునకుపయుక్తముగాను మా కార్యక్రమా లుండునని విశదపరచుచున్నాను. అలాయని ఇతరులకు బాధ కల్గించుటయో, బాధించుటయో కూడా జరుగదని స్పష్టపరుచు చున్నాను మా కార్యక్రమములపై అభిరుచి, అభిమానములతో. పాటు, అవగాహన అర్హతయున్న వారైనా, సహకరించి ప్రోత్సహించుటలో, ఆదరించుటలో అనౌచిత్యము లేదని భావిస్తాను. ప్రతి వారికి ఏదో ఒక ఇబ్బంది, నేటి సమాజ వాతారణంలో యున్నదని మాకు తెలియును. కాని వారివారి ఇబ్బందులను వారి స్వంతమని భావించి అధిగమించుచునేయున్నారు. ఆలాగే ఈ పత్రిక కాని, మాకార్యక్రమాలు కాని మీవిగా లేదా ప్రజలకు హితమైనవిగా మీరు భావిస్తే బహుశః మీకార్యములలాగే, ఈ సంస్థ కార్యక్రమాలును యధావిధిగా సాగిపోగలవని ఆశిస్తాను.

ఈ పండుగల సందర్భంగా, మీ కెల్లరకు భగవంతుడు సత్సంకల్పస్ఫూర్తిని ధార్మికకార్య అభిలాషను కల్గిస్తూ, ఆయురారోగ్య ఐశ్వర్యములతో పాటు సుఖసంతోషములు బడయగలరని ఆ పరమేశ్వరుని ప్రార్థిస్తూ-

**: సర్వేజనాః స్సుఖినోభవంతు :**

సంపాదకీయం

# దసరా - దీపావళి

సంవత్సరంలో దసరా దీపావళి పండుగలు హిందువులకు పరమోత్సాహభరితమైనవి, పరమానందప్రదమైనవి. ఆబాలగోపాలం ఆహ్లాద సంభరితంగా ఈ పండుగలు జరుపుకుంటారు. ఈ పండుగలు రావటానికి వారాలముందునుంచి ఎదురుచూస్తారు పిల్లలు. సమస్త ప్రకృతి వివర్తశోభతో కన్నులపండువ చేసే ఋతువు ఇది. ఆశ్వీజం పండువెన్నెలల కాలం తర్వాత కార్తీకమాసం పరమశివుడికి అత్యంత ప్రీతి పాత్రం. ఈ రెండు నెలలలో ఈ రెండు పండుగలు వస్తాయి.

పరమేశ్వరుడు మనకు సాక్షాత్కరించడు. కానీ పరమేశ్వరి ప్రకృతి రూపంగా మనకు నిరంతరం సాక్షాత్కరిస్తూనే ఉంటుంది. మాతృదేవతారాధన కలకాలం యుగయుగాలనుంచి ఈ దేశంలో ఉంది. ఈ సంస్కృతిలో ప్రధానాంశంగా అలరారుతున్నది. అసలు ఈ సృష్టికి మూలం ఆ పరాశక్తియేనని త్రిమూర్తులు కూడా ఆ తల్లి కనుసన్నల్లో మెలగవలసినవారేనని దేవీ భాగవతం చెపుతున్నది. ఇది శాక్తేయంగా యుగయుగాలుగా ఈ దేశ ఆధ్యాత్మిక జీవనంలో ఆరాధ్య స్థానాన్ని పొందింది.

ఏకైవశక్తిః పరమేశ్వరస్య
భిన్నాచతుర్ధాః వినియోగకాలే
భోగేభవానీ పురుషేషువిష్ణుః
కోపేచ కాళీ సమరేచ దుర్గా

అని శక్తి పూజాపరుల విశ్వాసం. ఆ దుర్గ సమస్త సృష్టికి ఆధార భూతురాలు, ఆరాధ్యదేవత. దసరా నవరాత్రుల్లో ఆ తల్లిని అర్చిస్తారు. ఆమె సమస్త శక్తికి, సమస్త విజ్ఞానానికి, సమస్త సంపదకు అధిదేవత. అందుకే బమ్మెర పోతన మహాకవి ఆమెనిట్లా స్తుతించారు

అమ్మలగన్న యమ్మ ముగ్గురమ్మల మూలపుటమ్మ చాలపె
ద్దమ్మ సురారులమ్మ కడుపారెడి పుచ్చినయమ్మ దన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ దుర్గమా
యమ్మకృపాబ్ధి నిచ్చుత మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్

లోకంలోని దుష్టభావాలకన్నిటికీ ప్రతీక మహిషాసురుడు. ఆ మహిషాసుర సంహారం చేసిన సింహవాహిని దుర్గ. 'జయజయతే మహిషాసురమర్దిని రమ్యకపర్దిని శైలసుతే'. 'అన్ని రసములకు ఆధారభూతయౌ అష్టమూర్తీ వధువునభినుతింతు' అన్నారు కైలాసవాసి ముదిగొండ వీరభద్రమూర్తి తన వందేమాతరం మహాకావ్య ప్రాస్తావిక మంగళాచరణంలో.

దసరా పండుగ పదిరోజుల పండుగ. ఇటువంటి పండుగ మరివొకటి లేదు. అమ్మవారికి ఈ పదిరోజులు వివిధ అర్చావతార, అలంకరణలు చేస్తారు. సంప్రదాయపరులైనవారు ఆశ్వీయుజ శుద్ధ పాడ్యమినాడే కలశస్థాపనం చేసి ఈ పదిరోజులు అమ్మవారిని స్వశక్త్యానుసార వైభవంతో అర్చనలు చేస్తారు. శివాలయాలన్నింటా పరమశోభాయమానమైన సందడి నెలకొంటుంది ఈ పదిరోజులు. ఆలయాల్లో సువాసినులు కుంకుమ పూజలు చేస్తారు. బాలికలను అమ్మవారి మూర్తులుగా అర్చించి భారతీయ మహోత్తమ సంస్కృతిని లోకానికి వెల్లడిస్తారు.

ఇక పిల్లలకు ఈ పండుగ ఎంత సంబరాన్ని తెచ్చిపెడుతుందో చెప్పలేము. నగర జీవనంలో సంస్కృతీ సంప్రదాయాలు కనుమరుగైపోతున్నవి గాని పల్లెల్లో ఈ పండుగల ఆనవాళ్ళు ఇంకా అలరారుతూనే ఉన్నాయి. యాభై అరవై ఏళ్ళ క్రిందటి వరకు గ్రామీణ ప్రాంతాలలో దసరా పండుగ పరమ కోలాహలంగా జరుపుకునేవారు ప్రజలు. బడి పంతుళ్లు చిరుత విద్యార్థులకు దసరా పద్యాలు నేర్పేవారు. గ్రామంలో కలవారి ఇళ్ళముందు బడిపిల్లలు వల్లించే దసరా పద్యాలు ఎంతో ముచ్చట గొలిపేవి. 'అయ్యవారికి చాలు ఐదు వరహాలు పిల్లవాళ్ళకు చాలు పప్పు బెల్లాలు' అని సమధికోత్సాహంతో రాగ వరసన ఉపాధ్యాయుల వదనాలు ప్రఫుల్లం కాగా చిన్నపిల్లలు దసరా పద్యాలు చదివేవారు. 'శ్రీహరి కరుణాకటాక్ష వీక్షణాలంకార ఆశ్రిత విద్వ జ్జనాధార అర్థిజన కుముదచంద్రోదయ దాసరాథేయ సత్యహరిశ్చంద్ర సంగ్రామ ధనుంజయ సాహసవిక్రమార్క' అని మన పురాణ దివ్యపురుషులను, సంస్కృతిని భారతీయ ధార్మిక జీవనపు విలువలను, గృహస్థులకు ఆ పసిపిల్లలు బోధించేవారన్నమాట. షోడశ మహారాజుల కథలను, షట్చక్రవర్తుల గాథలను తలచుకోండీ అని హెచ్చరించేవారన్నమాట. 'ధరసింహాసనమైన నభంబు గొడుగై, సిరి భార్యామణియై, విరించి కొడుకై, శ్రీగంగ సత్పుత్రియై, తద్దేవతల్ భృత్యులై పరమామ్నాయములెల్ల' వందిగణమై వంటి పద్యాలు ఎంత అందంగా ఉండేవి. హృదయంలో సరిగమలు పలికించేవి కావా? సుష్ఠు అయిన వాక్కు, సంస్కృతిమహితమైన భావన ఆ

చిన్ననాటి పసిమనసులలోనే నాటితే వయస్సు పెరిగినకొద్దీ వాళ్ళలో ఉత్తమ సంస్కారం ప్రబుద్ధమవుతుంది. దేశాభిమానం ప్రబోధితమవుతుంది. అంతేకాని మమ్మీ డాడీ సంస్కృతి వల్ల ఒరిగేదేముంది?! నదీ నదాలను, ప్రకృతినీ, దేశసంస్కృతినీ, మతధార్మిక విశ్వాసాలను, దేశీయమైన విద్యలను, కళలను, క్రీడలను, వినోదాలను, విలాసాలను మరిచిపోయి అంగాంగ భంగిమలన్నీ బట్టబయలు చేస్తూ ఆడా మగా పిచ్చి పాటలు, వెర్రి గెంతులు వేసే సినిమా, టీవీ విషసంస్కృతి వ్యాపిస్తున్నది ఇంటింటా నేడు. సున్నితమైన, సుతారమైన, సులలితమైన భావాలు ఆర్ద్రత పెంపొందించే చిత్తవృత్తికి అనువైన కథలు గాథలనుంచి పసిమనస్సులు వంచితమవుతున్నాయి. పైగా ఆ విలువలను, ఆకథలను దుర్వ్యాఖ్యానం చేసే, గేలి చేసే, నిందించే ప్రచార ధోరణులు, ప్రసార సాధనాలద్వారా వినబడుతున్నాయి, కనబడుతున్నాయి. యుగ పరిణామాలు ఎట్లానూ తప్పవు. కానీ సంప్రదాయం సంస్కృతుల మంచి నుంచి వంచితులం కావడం తప్పు దాని వల్ల మనం పొందే నష్టం ఎక్కువ.

కాబట్టి మన పండుగల ద్వారా సనాతనమైన మన సంస్కృతిని గ్రహించగలగాలి. అర్థంచేసుకునేందుకు ప్రయత్నించాలి. తెలిసినవారు తెలియని వారికి చెప్పాలి. ఇదంతా నిరాడంబరంగా భక్తిశ్రద్ధలతో, ఆర్తితో, కర్తవ్య బుద్ధితో నిర్వహింపబడాలి. మన దేశంలో ఈ కాలంలో ఆధ్యాత్మిక పత్రికలను నిర్వహిస్తున్న బృహత్తర కర్తవ్యం ఇదే. ఈ లక్ష్య సాధనలో 'విశ్వప్రకాశం' తనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నది.

ఇక దీపావళి పండుగ. ఈ పండుగ ప్రపంచంలోని అన్ని దేశాలవారూ ఏదో రూపంలో జరుపుకుంటారని విజ్ఞులు చెపుతున్నారు. నరకాసురుణ్ణి సంహరించి, కృష్ణుడు భూలోకాన్ని ఉద్ధరించటం ఈ పండుగ పరమార్థప్రతీక. చీకటులు నశించి వెలుగుల ప్రస్థానానికి శుభారంభం ఈ పండుగ సంకేతం. ఉత్తర దేశంలో కొన్ని ప్రాంతాలలో ఈ దీపావళిని ఉగాదిగా సంభావిస్తారు. నవజీవనానికి నాందీవాచకం పలుకుతారు. ఏడాదిపొడుగునా పండుగలన్నింటిలోను మిక్కిలి ఆనందోత్సాహాలతో జరుపుకునే పండుగ ఇది. దీపావళి అంటే దీపతోరణం అని అర్థం. ఎక్కడ చూసినా దీపకాంతులు ప్రసరిస్తాయి. వ్యాపారులు లక్ష్మీపూజ జరుపుతారు ఈ పండుగ సందర్భంగా. 'ధనమూలం ఇదం జగత్' మొత్తానికి ఈ దసరా దీపావళి పండుగల సందర్భంగా ముగురమ్మలు అర్చితులవుతారు. సర్వవిద్యలకు సరస్వతి అధిష్ఠాత్రి. సమస్త శక్తికీ పార్వతి అధినేత్రి. సమస్త సంపదలకూ లక్ష్మి

అధిదేవత. ఈ పండుగల ద్వారా వారిని ప్రసన్నులను చేసుకొనే పరమార్థం ఉద్దేశితమైంది. నిజానికి ముగ్గురూ ఒక్కరే. సౌందర్య లహరిలో శంకరభగవత్పాదులు దేవిని సర్వశక్తి స్వరూపిణిగా వర్ణించారు. దీనినే ఎంతో అందంగా బూర్గుల రామకృష్ణారావు మహోదయులు తెనిగించారు.

ఆగమవేత్తలుం బిలుతురమ్మరో 'బ్రాహ్మి'వి 'వాణి'వంచునిన్
'సాగరకన్య' విష్ణుసతి 'శాంకరి'వద్రికుమారి 'వంచునున్
కాగ తురీయులై పలుకుకందగరాని యసీమితామహా
భాగ మహత్వ మాయవయి భ్రాంతిని గొల్పెదు విశ్వమంతటన్.

ఈ జన్మదిన విశేష దసరా దీపావళి సంచికలో శంకర భగవత్పాదుల కనకధారాస్తవం ప్రచురితం. ఈ స్తుతి శ్రేయః కాముకులకు నిత్యపారాయణయోగ్యం.

## జన్మదిన ప్రత్యేక సంచిక

విశ్వ ప్రకాశం జన్మదిన ప్రత్యేక సంచికగా ఈ అక్టోబరు నెల సంచిక వెలువడుతున్నది. ఈనాటి సామాజిక పరిస్థితులలో సాంఘిక వాతావరణంలో ఆధ్యాత్మిక భావాలను నైతిక విలువలను పౌరాణిక విశేషాలను సాంస్కృతిక విషయాలని ప్రచురించే పత్రిక మనుగడ ఎంత కష్ట సాధ్యమో పాఠకులకు తెలియనిది కాదు. ఈ విధంగా ఒక పత్రికను నిర్వహించడం ఏటికి ఎదురీదడమే. నేటి సమాజంలో సామాన్య మధ్యతరగతి ప్రజల జీవన వ్యవస్థ రోజురోజుకు సంక్లిష్టమైపోతున్నది. అనేకమైన నిత్యనూతనమైన సమస్యలతో వారు సతమతమవుతున్నారు. అటువంటి వర్గంవారికి ఆధ్యాత్మిక విషయాలు తెలుసుకునే చిత్త స్వాస్థ్యం ఉండటంలేదు. ఇక రాజకీయ వర్గాలవారికీ, ధనకాంక్షాపరులకు సాంఘిక వ్యవస్థను పట్టించుకునే తీరిక ఉండదు. విద్యార్థి వర్గానికి అసంతృప్తులు, ఆందోళనలు, మాదకద్రవ్య సంసేవనం వంటి చౌకబారు వినోద విరామ కాలక్షేపాలతో సాంస్కృతిక విలువలను పట్టించుకునే అభిరుచి దూరమవుతున్నది. అయినా చీకటి రాత్రి చివరన ఉషోదయం ప్రకృతి ధర్మం. చీకటిని నిందిస్తూ నిష్క్రియాపరంగా కాలంగడిపేకంటే ఒక చిరుదివ్వెఐనా వెలిగించి ఆశాభావంతో సహనంతో సత్కార్య నిర్వహణకు, ప్రారంభించడం, మంచిదని విజ్ఞులంటారు. సర్వార్థ సంక్షేమ సమితి ఆ సదాశయానికే సర్వాత్మనా అంకితమైంది. తాను చేయగలిగిన పని చేస్తున్నది, విశ్వయోగి విశ్వంజీ మహరాజ్ ప్రేమ, శాంతి,

ఆశాభావం, అంకితదృక్పథం, విశ్వశాంతి, విశ్వాసం సంఘంలో ప్రోదిచేయటానికి చేపట్టిన కార్యక్రమరూప 'విశ్వప్రకాశం' ఏడాది నుంచి క్రమం తప్పకుండా వెలువడింది. ఎంతో విషయవైవిధ్యాన్ని సంతరించుకుంది. ఇప్పుడిక రెండో సంపుటం ప్రారంభమవుతున్నది. ఆ సందర్భంగా ఇప్పుడీ జన్మదిన ప్రత్యేక సంచిక వెలువడుతున్నది. మరింత పరిపుష్టంగా సర్వాంగ సుందరంగా వివిధవిజ్ఞాన విషయ సంపన్నంగా ముందు ముందు సంచికలు రూపొందించే ప్రయత్నం జరుగుతున్నది. సరిగా నూరు సంవత్సరాల క్రితం భారతదేశంలోని ఉత్తర, దక్షిణ ప్రాంతాలలోని సమస్త పుణ్యధామాలను సందర్శించి అక్కడి దేవాలయ విశేషాలను పురాణాంతర్గత క్షేత్ర మాహాత్మ్యాలను లిఖితం చేసిన మండపాక పార్వతీశ్వర శాస్త్రి (1833-1897) గారి 'యాత్రా చరిత్ర' అనే గ్రంథంలో ఎన్నో ఆసక్తికరమైన విశేషాలున్నాయి. బహుశా తెలుగులో వచ్చిన యాత్రాచరిత్రలలో ఇది రెండవదికావచ్చు. చతుర్విధ కవితా ప్రావీణ్యుడు, బొబ్బిలి సంస్థాన కవీశ్వరుడు, వీరు ఆనాటి వెంకటగిరి సంస్థానాధీశులకున్నూ కావలసినవారు. వేంకటగిరి రాజావారు భారతదేశ సమస్తపుణ్యక్షేత్రాలకు తీర్థయాత్ర జరుపుతూ ఈ మహాకవిని వెంటతీసుకొని పోయినారు. అప్పుడే మహాకవి కాశీగయాప్రయాగ ఉజ్జయిని వంటి ఉత్తరదేశ పుణ్యక్షేత్రాలను తిరుపతి, శ్రీశైలం, కాళహస్తి, కంచి, చిదంబరం, శ్రీరంగం, రామేశ్వరం వంటి దక్షిణాది పుణ్యక్షేత్రాలను దర్శించి అష్టాదశ పురాణాలలో నిబద్ధమైన అక్కడిక్షేత్ర మహాత్మ్యాలను కమనీయమైన దేవతాస్తుతులను ఈ యాత్రాచరిత్రలో పొందుపరచారు. ఈ విశేషాలు క్రమంగా ముందుముందు విశ్వప్రకాశం సంచికలో వెలువడుతాయి.

ఈ సంచికలో ఆదిశంకర భగవత్పాదులవారి దివ్యావతార ప్రసిద్ధిగన్న కాలడి పుణ్యక్షేత్రాన్ని గురించి పరిశోధనాత్మకమైన వ్యాసం ప్రచురిస్తున్నాము. శంకర భగవత్పాదులవారు అవతరించి ఉండకపోతే భారతదేశ భవితవ్యం ఎప్పుడో ప్రశ్నార్థకంగా మారిపోయి ఉండేది. భారతదేశపు ఆత్మను సంరక్షించిన మహానుభావుడాయన. వారిని గూర్చి, ఆ పుణ్యక్షేత్ర దర్శనీయ స్థలాలను గూర్చి, పావిత్ర్యాన్ని గూర్చి, సాంస్కృతికత పునరుజ్జీవన ప్రచోధనను గూర్చి 'విశ్వప్రకాశం' పాఠకులు తెలుసుకొనే అవకాశం ఈ విధంగా సమకూడింది. దసరా-దీపావళి పండుగ శుభాకాంక్షలు పాఠకులకందిస్తున్నాము.

# సర్వార్థ సంక్షేమ సమితి,

**501, ప్రదీప్ అపార్ట్‌మెంట్, గాంధీనగర్, హైద్రాబాద్ - 380.**

*సభ్యులుగా చేరండి - ధార్మిక సేవలో పాల్గొనండి*

| | సర్వార్థ సంక్షేమ సమితి సభ్యత్వవివరములు | విశ్వప్రకాశం సభ్యత్వవివరములు |
|---|---|---|
| 1. మహారాజపోషకులు | రు. 1,00,000-00 | రు. 15,000-00 |
| 2. రాజపోషకులు | రు. 50,000-00 | రు. 10,000-00 |
| 3. పోషకులు | రు. 25,000-00 | రు. 5,000-00 |
| 4. కార్యనిర్వాహక సభ్యత్వము | రు. 10,000-00 | - |
| 5. శాశ్వత సభ్యత్వము | రు. 1,000-00 | రు. 1,000-00 |
| 6. వార్షిక సభ్యత్వము | రు. 100-00 | రు. 60-00 |
| 7. ద్వివార్షిక సభ్యత్వము | - | రు. 120-00 |
| 8. విడి ప్రతి | - | రు. 5-00 |

పై సభ్యత్వములకు చెక్కు లేదా డి.డి. ద్వారా లేదా నగదు రూపకంగాను స్వీకరించబడును. మరియు 80 G ఇన్‌కంటాక్సు లబ్ధి పొందవీలగును.

*విశ్వప్రకాశం ధార్మిక మాసపత్రికకు*
*ప్రకటనలు పంపండి, ప్రోత్సహించండి*

## పత్రికా ప్రకటన వివరములు

| | |
|---|---|
| 1. వెనుక కవరు పేజీ | రు.2,500-00 |
| 2. రెండవ కవరు పేజీ | రు.1,500-00 |
| 3. మూడవ కవరు పేజీ | రు.1,500-00 |
| 4. లోపలి పూర్తి పేజీ | రు. 500-00 |
| 5. 12 మాసాలకు 12 సంచికలకు చిన్నసైజులో | రు.2,500-00 |

## నేటివరకు విశ్వప్రకాశమునకు పోషకుల వివరములు

*మహారాజపోషకులు*

1. గురుదత్తా గ్యాస్‌సర్వీసెస్, హైద్రాబాద్
2. విశ్వతేజా ఫార్మసూటికల్స్, విజయవాడ

3. అంబుజా గ్యాస్ ఏజన్సీస్, హుజూరాబాద్
4. యన్.వి. సుభాష్‌గారు, హైద్రాబాద్
5. జూపిటర్ ఏజన్సీస్, మద్రాసు
6. జూపిటర్ ఏజన్సీస్ మిత్రుడు, మద్రాస్
7 జూపిటర్ ఏజన్సీస్ బంధువు, మద్రాస్
8. జూపిటర్ ఏజన్సీస్ శ్రేయోభిలాషి, మద్రాస్

*రాజపోషకులు*

1. పద్మావతి మెడికల్స్, తిరుపతి

పి.వి. మనోహరరావు
ముఖ్యసంపాదకులు

## దేశ రాజధాని ఢిల్లీలో "సర్వార్థ సంక్షేమ సమితి----- ద్వారా నాలుగు రోజులు మహా యజ్ఞము.

గడచిన సెప్టెంబరు 14,15,16,17, తేదీల్లో పెద్ద యెత్తున ఢిల్లీలో సర్వార్థ సంక్షేమ సమితి కార్యక్రమాలు నిర్వహించినది. శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ గారు మరియు కుర్తాళం శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ శివ చిదానంద భారతీ స్వాము లు ముఖ్యులుగా మరియు ధర్మపురి హైద్రాబాద్ మున్నగు ప్రదేశములనుండి వచ్చిన వేద పండితులు, ఢిల్లీ కార్యక్రమాలలో పాలు పంచుకొనిరి. వేద పండితులు కుటుంబీకులు, సమితి సభ్యులు, శ్రేయోభిలాషులు, స్వామీజీ భక్తులు, మున్నగు వారు దాదాపు 95 మంది హైద్రాబాదు నుండి ఢిల్లీ చేరిరి. వీరుకాక, తిరుపతి, మదరాసు, పూనా, విజయవాడ మొదలగు ప్రదేశములనుండి ఆగమ పండితులు, ఆగమ సదస్సులో పాల్గొని ప్రసంగించిరి. ఈకార్యక్రమం ముందుగా, మే లేదా జూన్ మాసాల్లో నిర్వహించవలెనని సంకల్పించినా, ఎండల కారణంగానూ, పావనీరుకు తగినన్ని ప్రకటనలు రాని కారణంగానూ, ప్రముఖులు పాల్గొనుటకై వ్యవధి చాలనందునను, ఇతరత్రా అనేక కారణాలచే సెప్టెంబరు నెలలో నిర్వహించబడినవి. వీరందరికి, వసతులు, భోజనములు, రాను పోను ఖర్చులు, రవాణా ఇత్యాది సదుపాయములన్నియు ఏర్పరచబడినవి. రోజు వారిగా ఈ జ్ఞాన యజ్ఞ కార్యక్రమం దిగువ పొందు పరచడమైనది.

**14 – 9– 1995 :** పైన తెలిపిన వారంతా, 12న కొందరు మరియు 13వ తేదీ కొందరు, బయలు దేరి 14వ తేదీ కార్యక్రమములో పాల్గొనిరి. ఆరోజు వసంత్ విహార్‌లోని శ్రీ శృంగేరీ శంకరమఠంలో గణపతి పూజ, వాస్తు పురుషపూజ, పుణ్యాహవాచనం,నవగ్రహ పూజలు, దీక్షా వస్త్రములిడు కార్యక్రమాలు, శ్రీ బుడిసత్యనారాయణ సిద్ధాంతిగారిఆధ్వర్యంలో నిర్వహించబడినవి. తరువాత శతరుద్రాభిషేకము, నవగ్రహ, రుద్ర, చండీహవనములు మధ్యాహ్నం నుండి సాయంత్రం వరకు జరిగినవి. ఈ కార్యక్రమాలు మొత్తం శ్రీ విశ్వంజీ మరియు కుర్తాళం స్వామీజీల సమక్షంలో, మాదంపతుల నిర్వహణలో 10 మంది ఢిల్లీ పండితులు, ఇచటి దాదాపు 35 మంది మొత్తం 45 మంది వేదపండితుల పఠన ఘోషలో, సాయంత్రం 6 గం॥లకు పూర్ణాహుతితోముగిసినవి. ఆ తర్వాత అదే శంకరమఠంలో బ్రాహ్మణ సమారాధన దాదాపు 200 మందికి, సశాస్త్రీయంగా యేర్పాటు చేసి నిర్వహించబడినది. తర్వాత వేద మంత్రాలతో బ్రాహ్మణుల ఆశీర్వచనములు పొంది, వారికి దక్షిణతాంబూలాదులు సమర్పించగా నాటి కార్యక్రమాలు ముగిసినవి.

15-9-1995 : న్యూఢిల్లీలోని ఆంధ్రప్రదేశ భవనంలోని, అంబేద్కార్ ఆడిటోరియం, రంగు రంగుల స్వాగత తోరణాలతో స్టేజీని "spiritual Values for Universal Intigration and Peace " అనే రంగులకుంచెలతో, తీర్చి దిద్ది, మొక్కల కుండీలతో, టేబుళ్ళు, కుర్చీలు, అమర్చి, రకరకాల విద్యుత్ కాంతులతో, మైకు సెట్లతో వీడియో, కమేరా మనుషులతో, సభాసదులతో, కళకళ లాడుచున్నది. దాదాపు 11 గం॥ల సమయం. ఆనాటి ముఖ్య అతిథి గా॥ శ్రీ పి.వి. రంగయ్యనాయుడు భారత జలవనరుల మంత్రిగారు ఏతెంచగా, నేను , మిగతా కార్యకర్తలు సాదరంగా ఆహ్వానించి కూర్చోబెట్టి, నాటి సభాధ్యక్షులు, శ్రీశ్రీశ్రీ కుర్తాళం స్వామీజీ రాకకై ఎదురు చూడగా దాదాపు 11-30 గం॥లకు ఇర్వురు స్వామీజీలను, శ్రీ రంగయ్య నాయుడుగార్ని, కార్యనిర్వాహక మరియు సర్వార్థ సంక్షేమ సమితి అధ్యక్షులుగా నన్ను, శ్రీ బుడి సత్యనారాయణ సిద్ధాంతిగారు నాటి నిర్వాహకులు సభా వేదికపైకి ఆహ్వానించిరి. ఈలోపు శ్రీ మధు శంకర శర్మ గారు వేద పఠన గావించి. శ్రీ సిద్ధాంతిగారు గణపతి ప్రార్థన చేసి విపులీకరించిరి.

శ్రీ రంగయ్య నాయుడుగారి జ్యోతి ప్రజ్వలనతో నాటి "ఆలిండియా ఆగమసదస్సు' ' ఆరంభింపబడినది. వేదికపై గల పెద్దలకు పూల గుచ్ఛములిచ్చి సత్కరించితిని. తొలుత నేను అతిథులకు, ఆహూతులకు మరియు సభా సదులకు స్వాగత వచనములతో పాటు, ఆగమ సదస్సు లక్ష్యము, ఆగమశాస్త్ర ప్రాశస్త్యము, ఆవశ్యకతను గురించి ఆంగ్లములో విన్నవించితిని. తర్వాత అధ్యక్షోపన్యాసంలో శ్రీ శివచిదానంద భారతీస్వాములు అభిభాషించి ఆశీర్వదించిరి. ఆ తరువాత ముఖ్య అతిథి శ్రీ రంగయ్య నాయుడుగారు తమ ప్రసంగము గావించిరి. తర్వాత శ్రీ విశ్వంజీగారి ఆశీఃభాషణం జరిగినది. తదాదిగా శ్రీ రఘునాధాచార్య వైస్ చాన్సలర్ సంస్కృత యూనివర్సిటి తిరుపతిగారు పాంచరాత్ర ఆగమము గురించి ఆంగ్లంలో అనర్గళంగా ప్రసంగించి సదస్సులో ప్రధమోపన్యాసముగావించిరి. తరువాత వరుసగా శ్రీ అర్చకం రామ చంద్ర దీక్షితులు (తిరుపతి)గారు తెలుగులో, వైఖానస ఆగమము మరియు శ్రీ వెంకటేశ్వర స్వామిపూజా విధుల గురించి ప్రసంగించిరి. శ్రీ కొరిడె రాజన్న శాస్త్రి సంస్కృతంలో (ధర్మపురి) శాక్తాగమము గురించి ప్రసంగించిరి. శ్రీ డా॥ సభారత్నంగారు (మదరాసు) శైవ ఆగమముగురించి యింగ్లీషులో అనర్గళంగా అభిభాషించిరి. దాదాపు 2 గం॥ల సమయం కావచ్చినందున భోజన విరామమునకు ఒక గంట పాటు కార్యక్రమములు నిలుపబడెను. ఎ.పి భవనంలో దాదాపు 300 మందికి భోజనములు ఏర్పాటు చేయబడినవి. మరియు వేద పండితులు 40 మందికి మరియు శ్రీ కుర్తాళం స్వామీజీకి, వారి శిష్యులకు శంకరమఠంలో మడి ఆచారములతో భోజనాలు యేర్పాటు చేయనైనది.

నేడు 3-30 గం॥లకు తిరిగి సదస్సు ఆరంభింపబడినది. శ్రీ రఘునాధాచార్యగారు అధ్యక్షత వహించిరి. డా॥ పి. నాగేశ్వరరావుగారు (Endowment Dept. Hyd ) శైవాగమంపై ఆంగ్లంలో ప్రసంగించిరి. డా॥ పి.పి. ఆప్టేగారు (పూనా) ఆగమవైష్టవీకరణ, మరియు లోక కళ్యాణం గురించి ఆంగ్లంలో ప్రసంగించిరి. శ్రీహరిలక్ష్మీ నరసింహశర్మ హైద్రాబాద్ వాస్తవ్యులు ఆంగ్లంలో ఆగమము దాని వ్యాఖ్యానాది తాత్పర్యముల విశదీకరించిరి. డా॥ కొరిడె రామారావుగారు (హైద్రాబాద్) సంస్కృతములో, ఆగమ వైశిష్ట్యము లోకకళ్యాణము గురించి విపులీకరించిరి. శ్రీ యేలూరుపాటి అనంతరామయ్య గారు (హైద్రాబాద్) సంస్కృతములో వైదికాగమం గురించి ప్రసంగించిరి. డా॥ మల్లాది గోపాలక్రిష్ణ శర్మగారు ఆంగ్లంలో ఋగ్వేదము, ఆగమములపై ప్రసంగించిరి. శ్రీ గౌరీభట్ల రఘునాథశాస్త్రి (హైద్రాబాద్) సంస్కృతములో వైదికాగమ నిగమాగమముల గురించి అనర్గళంగా ఉపన్యసించిరి. శ్రీ ఒజ్జల నరహరిశర్మ (ధర్మపురి)గారు సంస్కృతములో, ఆగమశిల్ప, మంత్రవిద్య, వైదికాగమ పూజావిధుల గురించి ప్రవచించిరి. శ్రీ కుందుర్తి సత్యనారాయణశర్మ (విజయవాడ) ఆంగ్లంలో ఆలయాల్లోని యంత్ర మంత్రాదుల గురించి విశదీకరించిరి. శ్రీ మాచవోలు రాజశేఖరశాస్త్రిగారు ఆంగ్లంలో ఆగమములు మోక్షానికి సోపానములని ప్రసంగించిరి. శ్రీకొట్టె విశ్వనాథం (ధర్మపురి) గారు తెలుగులో ఆగమాలకు భక్తి ఆవశ్యకత గురించి ప్రసంగించిరి.

చివరలో శ్రీ రఘునాధాచార్యగారు, నేటి సదస్సు లక్ష్యాలను, వివరిస్తూ, ప్రసంగాలతో సదస్సు ముగించక భవిష్యత్తులో కార్యాచరణకు నేటి సదస్సు, పునాది గా నిలచి, పని చేయుటకు సదస్సు తీర్మానములు ప్రవేశ పెట్టవలెనని కోరి తమ అమూల్య అభిప్రాయము తెలియ చేయగా శ్రీ కె. సత్యనారాయణ (Endowment Dept Hyd) గారు ఈక్రింది తీర్మానములను చదివి సభికులకు వినిపించిరి.

1. అఖిల భారత ఆగమ మహాసభ ఆవిర్భావము నేడు జర్గినట్లు తీర్మానించబడినది.

2. దేశంలోని ఆగమ పండితుల, ఆగమ అర్చకుల, ఆగమ సంబంధ సమస్యలు చూచుట, పరిష్కరించుట, సలహాలందించుట, మహా సభ కర్తవ్యము.

3. ఈ మహాసభ హెడ్ ఆఫీసు హైద్రాబాద్‌లో యుండి పనిచేయును.

4. ఈ కమిటీకి శ్రీశ్రీశ్రీ శృంగేరీ జగద్గురువు శంకరాచార్యులు గౌరవాధ్యక్షులుగాను, శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీగారు, శ్రీశ్రీశ్రీ శివచిదానందభారతీ స్వాములు, కురుతాళం పీఠాధిపతులు శాశ్వత సలహాదార్లుగాను శ్రీ పి.వి. మనోహర రావు అధ్యక్షులుగాను

శ్రీ బుడి సత్యనారాయణ సిద్ధాంతి జనరల్ సెక్రటరీగాను యేకగ్రీవంగా సభ తీర్మానించి యెన్నుకోబడిరి. మిగతా ఆఫీసు సభ్యులు, ఎక్సిక్యూటివ్/కమీటీని, అధ్యక్ష కార్యదర్శులు ఎంపిక చేయుదురు.

5. దేశంలోగల ఆలయ అర్చకులు, ఆగమ పండితులు, ఆగమ విద్యార్థులు మరియు ఇచ్చగలవారెల్లరు సభ్యత్వము పొందవచ్చును.

6. దేశంలో ప్రతి రాష్ట్రంలో ఒక శాఖ నెలకొల్పబడును.

7. ప్రతి సభ్యునికి ప్రాథమిక సభ్యత్వముపొందుటకు రూ. 100/-లు నిర్ణయించబడినది.

8. ఎన్నికైన సభ్యులు 3 సం॥లు పనిచేయుదురు. తర్వాత మరల ఎన్నికలు మహాసభచే ఏర్పాటు చేయబడును.

9. ఒక న్యాయ శాశ్వత సలహాదారు అవసరానికి న్యాయ సలహాలందించుటకు ఏర్పాటు చేయబడును.

10. ఈ మహాసభ ముఖ్య ఉద్దేశ్యం, దేశంలోని అన్ని దేవాలయాలను సర్వేచేసి, 3 విధాలుగా వానిని విభజించాలి. వాని ధూపదీప నైవేద్యములకు నెలకు 1000/- 800/- 500/- చొ॥న అందించుటకు నిర్ణయము చేయాలి. ఇందుకుగాను మహాసభ మూలనిధి దాదాపు 100 కోట్లు అవసరమని భావించనైనది. ఈనిధిని తిరుపతి మున్నగు దేవాలయాల ద్వారా వ్యక్తుల ద్వారాను పొంద ప్రయత్నం గావించ వలయును.

11. మూలధన సేకరణకు మానవ వనరుల శాఖ భారత ప్రభుత్వమును కూడ కోరవలయును.

12. ఈ మహాసభ ఆగమ విద్యాలయములను, ఆగమ గ్రంథముద్రణను చేపట్టును.

13. ఈ మహాసభ ఆగమ అర్చకులకు స్వల్ప వ్యవధి కోర్సుల నిర్వహించి, అర్చకులకు పరీక్షలు నిర్వహించి, పత్రము లిచ్చును.

14. ఈ మహాసభ పేద అర్చకులకు, మరియు ఆగమ పండితులకు ఆర్థిక సహాయమందించును.

15. ఈ సభ ఆగమ పండితులనుండి, ఎంపిక చేసి విశిష్ట పండితులుగా నిర్ణయించి, ఆయా సందర్భాలలో గౌరవించును.

16. ఈ సభ ఆగమ శాస్త్రంలో పోటీలు కూడా నిర్వహించి ఎన్నికైన వార్ని గౌరవించి సన్మానించుటతోపాటు, స్కాలర్ షిప్‌లు కూడా యేర్పాటు చేయును.

17. ఈ మహాసభ ఆగమ పండితులకు ఉపాధి కూడా కల్పించును.

18. దేశంలోని ముఖ్య దేవాలయాల్లో పని చేయు ఆగమ విశిష్ట వ్యక్తుల పేర్లు నమోదు చేసి, వారి సేవలను, ఆగమ విద్యార్థులకు వినియోగించుకోబడును.

19. ఈ సభ ఆలయ నిర్మాణములు మరమ్మతులు, చేపట్టుట మరియు భక్తులకు ఇంపుగా నుండునట్లు, పవిత్రత, ప్రశాంతలతో పాటు, పారిశుద్ధ్యముగా నుండుటకు ప్రోత్సహించును. నిర్మాణములన్నియు ఆయా ఆగమ శాస్త్రమునకు అనుగుణంగా యుండునట్లు, శ్రద్ధవహించుట జరుగును.

20. ఈసభకు దేవాలయాలకు అవసరమున్న ఆగమ ఆచార వ్యవహారములు నిల్పుటకు వివిధ రాష్ట్రములలోని, దేవాలయాధికారులకు, దేవాలయ అర్చకులకు ప్రభుత్వాధికారులకు, సలహా సంప్రదింపుల నొసగి తగు చర్యలు గైకొనుటకు, ఈమహాసభ లక్ష్యముతో బాటు అర్హత దక్షత గలిగి యున్నదని తీర్మానించబడినది.

ఈపై తీర్మానములన్నియు, సభికులు ఏకగ్రీవముగా కరతాళధ్వనుల ద్వారా ఆమోదింపబడినవి. ఆమోదమొందినట్లుగా సభాధ్యక్షులు, ప్రకటించిరి.

ఆ తరువాత శ్రీకుర్తాళం స్వామీజీ సభికులను, కార్యనిర్వాహకులకు ఆహూతులకు సాదరంగా శ్రీ రాజరాజేశ్వరీ మాత ఆశీస్సులందించిరి. మరియు ఆగమ పండితులు కొందరికి ఈ దిగువ తెల్పిన బిరుదు ప్రధానములు, వారి పీఠము ద్వారా నొసగినట్లు ప్రకటించిరి.

1. డా॥ పి.పి ఆప్టేగారు "పాంచరాత్ర ఆగమవిశారద"

2. డా॥ సభారత్నంగారు "శైవాగమాచార్య"

3. శ్రీ కె. రాజన్న శాస్త్రిగారు - "శాక్తాగమవిశారద".

4. శ్రీ కుందుర్తి సత్యనారాయణగారు - "శాక్తాగమకోవిద"

5. శ్రీ రఘునాథాచార్యులు గారు - "పాంచరాత్ర ఆగమ[illegible]

6. శ్రీ అర్చకం రామచంద్ర దీక్షితులు గారు "వైదికాగమాలంకార"

7. శ్రీ గౌరీభట్ల రఘునాథశర్మగారు "వైదికాగమాలంకార"

8. శ్రీ కొరిడె రామారావు గారు "వైదికాగమాలంకార"
9. శ్రీ బజ్జెల నరహరిశర్మగారు "వైదికాగమాలంకార"
10. శ్రీ మల్లాది గోపాలక్రిష్ణ శర్మగారు "వైదికాగమాలంకార"
11. శ్రీ యేలూరుపాటి అనంతరామశ[illegible]గారు "వైదికాగమాలంకార"
12. శ్రీ మాచవోలు రాజశేఖరంగారు "వైదికాగమాలంకార"
13. డా.పి. నాగేశ్వరరావుగారు "శైవాగమకోవిద"

ఈ బిరుద ప్రదానం తరువాత శ్రీ విశ్వయోగి విశ్వంజీగారు అనుగ్రహ భాషణంతో సభికులకు ఆశీస్సులు మరియు కార్య నిర్వాహకులకు, ఆశీస్సులతో పాటు ద్విగుణీకృత ఉత్సాహము లభించినది. ఆ తర్వాత, నాటి సదస్సులోని వక్త లందరికి, మొమెంటో మరియు శాలువాతో స్వామీజీ సత్కరించగా సభికులు సన్మానితులు, సంతోషముతో ఉప్పొంగిపోయిరి. శ్రీ సత్యనారాయణ సిద్ధాంతిగారి, వందన సమర్పణతో సాయంత్రం 6 -30 గం॥లకు నేటి తొలి దశ కార్యక్రమము ముగిసినది. అరగంట వ్యవధి టీ, కాఫీలకై విరామ మీయబడినది.

15 - 9 - 95 సాయంత్రం 7 గం॥లు ఆంధ్రప్రదేశ్ భవనంలోని ఆడిటోరియం వేదికపై ఆగమ సదస్సుకు బదులుగా, అష్టావధానం, శ్రీ నాగఫణి శర్మగారిచే యనే బ్యానర్ కానవచ్చినది. నాటి సంస్కృత అష్టావధాన కార్యక్రమానికి అధ్యక్షులు డా॥ మండన్ మిశ్రాగారు వేంచేసి యున్నారు. ముఖ్య అతిథి ఢిల్లీ హైకోర్టు ముఖ్య న్యాయాధీశులు శ్రీ జగన్నాధరావుగారు వేంచేయగా, నేను, మిశ్రాగారు తదితరులు సాదరంగా అహ్వానించినాము. శ్రీ శ్యాం సుందర్ తుల్సియాన్ కన్వీనర్‌గారు, శ్రీ జగన్నాథ రావుగారిని వేదిక పైకి ఆహ్వానించిరి, అలాగే పృచ్ఛకులుగా వ్యవహరించు, ప్రముఖులు, శ్రీ సత్యదేవ చౌదరి, శ్రీమతి ఉషా చౌదరి, డా॥ ఐ. పాండు రంగారావుగారిని డా॥ రామకరణ్ శర్మగారిని, శ్రీ సత్యవ్రత శాస్త్రి గారిని డా॥ వాచస్పతి ఉపాధ్యాయగారిని డా॥ రఘునాథాచార్య గారిని శ్రీ అనంత రామయ్య గారిని, డా॥ యజ్ఞరాములు గారిని శ్రీ పి. రామశర్మగారిని డా॥టి. ఆర్ స్వామినాథంగార్ని మరియు నన్ను కూడా వేదిక పైకి ఆహ్వానించిరి.

శ్రీ జగన్నాథరావుగారి జ్యోతి ప్రజ్వలనతో నాటి సంస్కృత అష్టావధాన కార్యక్రమము ఆరంభమాయెను. నేను శ్రీ అవధానికి, అధ్యక్షులకు, ముఖ్య అతిధికి, ఆహూతులకు సాదర స్వాగతముతోపాటు తెలుగులోగల అవధాన ప్రాశస్త్యము

ప్రక్రియ మరే ఇతర భాషలలో లేవందున, ఇతర భాషలలోనికి ప్రచారం చేయుటకు నాటి వేదిక లక్ష్యమని శ్రీ శర్మగారి గురించి, వారి అవధానముల గురించి సభికులకు ఆంగ్లములో తెలియచేసి, స్వాగత వచనములు పలికితిని. ఆతరువాత శ్రీ మండన్ మిశ్రాగారు కూడా తమ అధ్యక్షోపన్యాసంలో పృచ్ఛకులను పరిచయం చేసి, అవధాన ప్రక్రియ గురించి అవధాని గురించి ప్రవచించిరి. ఆ తరువాత శ్రీ జగన్నాధరావు గారు ముఖ్యోపన్యాసము చేసిరి. శ్రీ నాగఫణి శర్మగారి అవధానం యధాప్రకారం రెండు గంటలు అమోఘంగా జరిగినది. పృచ్ఛకుల ప్రశ్నలకు అవధానిగారు చక్కటి సంస్కృత కవితాగానంతో సమాధానములిచ్చి, సభికులను రంజింప చేసిరి. చివరగా శ్రీ జి.వి.జి కృష్ణమూర్తి గారిని శ్రీ విశ్వంజీ గారిని నన్ను చక్కని పొగడ్తలతో శ్లోకాలాలపించిరి.

ఆ తరువాత శ్రీ విశ్వంజీ గారిచే, అవధాని గార్కి ముఖ్య అతిథికి, పృచ్ఛకులకు మెమొంటోలతో శాలువాలతో సన్మానము చేయబడినది. శ్రీ జి.వి.జి కృష్ణమూర్తి ఎలక్షన్ కమీషనరు గారును కొందరిని సన్మానించిరి.

ఇంతటితో 15-9-95 రోజటి సుదీర్ఘ కార్యక్రమములు ముగిసి, భోజనాదులకు విశ్రాంతికి ఎల్లరు నిష్క్రమించిరి.

16-9-95 ఆంధ్రభవనంలో పూల తోరణాలు, రంగుల బల్బులు, ఉత్సాహంగా కార్యకరలు ఆహూతులు, ముఖ్య అతిధికై ఎదురు చూచు చునారు. సేజీసె " Spiritual Values for Universal Integration an : Peace" మధ్యలో ఒకవైపు Inauguration by Ho'ble Vice President Sri K. R.Narayanan అనియు రెండో వైపు Organised by Sarvartha Sankshema Samithi -Chairman Sri P. V Manohar Rao అని రంగుల అక్షరాలతో సుందరంగా కాన్పించుచున్నది. సరిగా 10-55 గం॥లకు గౌ॥ శ్రీ కె. ఆర్. నారాయణన్ భారత ఉపరాష్ట్రపతి గారు హాలు బయటకు చేరగా, నేను మరియు జస్టిస్ శ్రీ రంగనాథమిశ్రాగారు ఆహ్వానించి వేదికపైకి మిశ్రాగారు వెంబడించగా ఇర్వురు స్వామీజీలను నేను వేదికపైకి ఆహ్వానించి వెంబడించితిని. ముందుగా ఉపరాష్ట్రపతికి, స్వామీజీలకు మిశ్రాగారికి గౌరవ పురస్సరంగా పూలగుచ్ఛము లీయబడెను.

కార్యక్రమానికి ముందుగా గణేశవందన బృందగానం, శ్రీమతి రాధాకృష్ణన్ మరిద్దరు మహిళలు ఆలపించిరి. ఆ తరువాత గౌ॥ ఉపరాష్ట్రపతిగారు జ్యోతి

ప్రజ్వలనగావించి సభా సదస్సునారంభించిరి. ముందుగా చిన్నారి 6 సం॥ల పాప నాగరంగ విద్యాలక్ష్మి భగవద్గీత గీతోపదేశ సంస్కృత శ్లోకాలను చదువుచు ఆంగ్లములో వ్యాఖ్యానము దాదాపు 15 ని॥లు గావించగా, శ్రీ కె.ఆర్. నారాయణన్‌గారు అమ్మాయిని చెంతకు చేర్చుకొని, శాలువాతో సత్కరించిరి. ఆ తరువాత నేను ఆంగ్లములో అతిథులకు స్వాగతముతో పాటు, ఈ సదస్సు ముఖ్యోద్దేశములను, మానవ విలువల పరిరక్షణా ప్రాముఖ్యమును, స్వామీజీల ఆశీస్సులను, పెద్దల సహకారామును ఆహూతుల ఆదరమును కోరితిని.ఈలాటి సదస్సులు ముందు ముందుకూడా ఇతర ప్రదేశాల్లో చేయ సంకల్పించి, మానవుల్లో మానసిక పరివర్తనావశ్యకతను, గురించి విశదీకరించితిని. ఆతరువాత శ్రీ రంగనాథ మిశ్రాగారు. ఉపరాష్ట్రపతికి , స్వాములకు సభికులకు, స్వాగతం తెల్పి, మానవ విలువల ప్రపంచ పోకడల గురించి ప్రసంగించిరి. శ్రీ కురుతాళం స్వామీజీ, ప్రసంగించి ఆశీర్వదించిరి. మరియు శ్రీ విశ్వయోగి విశ్వంజీగారును, వసుధైక కుటుంబ ఆవశ్యకతను, శాంతి సుఖాలకు మానవ సమైక్యతా ప్రయత్నములపై ప్రసంగించి ఆశీర్వదించిరి. 2010 సం॥వరకు భారతదేశం అగ్రగామి దేశంగా మారునని భవిష్యవాణిని సెలవిచ్చిరి. శ్రీ కె.ఆర్. నారాయణన్‌గారు తమ ఉపన్యాసంలో, ప్రపంచంలో ఎటు చూచినా హింసా దౌర్జన్యములతో అట్టుడుకుతున్న ఈ తరుణంలో ఈలాంటి సదస్సుల ద్వారా ప్రపంచానికి, భారతదేశ, శాంతికాముకతను చాటు సందర్భమున తాను సదస్సులో పాలు పంచుకొనుటకై సంతోషము వెల్లడించిరి. ప్రపంచంలో చాలా దేశాలు భారత శాంతిమార్గమును ఆచరించు ప్రయత్నం ఆరంభమయిందని, శాంతి సహజీవనం సమైక్యతలు అతి త్వరలో సాధించి వసుధైక కుటుంబ సాధన సుగమమయ్యే రోజు ఎంతో దూరము లేదని వక్కాణించిరి. |

ఉపరాష్ట్రపతిగారు ఈ సందర్భంలో సర్వార్థ సంక్షేమ సమితి ప్రచురించిన "విశ్వకిరణం" సావనీరును ఆవిష్కరించిరి. శ్రీ కె.ఆర్. నారాయణన్‌గారికి స్వామీజీలకు, శ్రీ మిశ్రాగారికి మొమెంటోలు శాలువాలతో సత్కరించితిని - ఆతరువాత ధన్యవాదములు తెలుపగా నేటి ఉదయం, ప్రారంభసభ ముగిసినది. అరగంట టీ, కాఫీలకై విరామం తెలుపగా ఉపరాష్ట్రపతిగారు, స్వామీజీలను వెంబడించి ఎ. పి. భవనంలోని తన గదికి పోయిరి. నేను శ్రీ రంగనాథ మిశ్రాగారు, శ్రీ జి.వి.జి .కృష్ణమూర్తిగారు, శ్రీ నాగఫణి శర్మగారు కూడా స్వామీజీ గదికిపోయి అచటనే కాఫీలు సేవించి, అరగంట గడిపితిమి. తర్వాత ఉపరాష్ట్రపతి గారిని కారు దాకా పంపించి హాలుకు చేరితిమి.

ఉదయం సదస్సులో డా॥ పాండు రంగారావుగారు ప్రారంభోపన్యాసము చేసిరి. తరువాత శ్రీ హర్షదౌ బదేల్ నేపాల్ రాయబారి ప్రసంగించిరి. దాదాపు 1-30 ని.లకు సభికులందరికి 300 మందికి అచటనే భోజనాలు యేర్పాటు చేయబడగా అందరు భుజించిరి.

16-9-95 సాయంత్రం సరిగా 3-30 గం॥లకు శ్రీ జి.వి.జి. కృష్ణమూర్తి భారత ఎన్నికల కమీషనరుగారు ముఖ్య అతిధిగా వేంచేయగా వారికి స్వాగతము పలికి వెంటయుండి, శ్రీ విశ్వంజీ గారితో సహా వేదికపైకి చేరితిమి. శ్రీ రంగనాథ మిశ్రాగారు శ్రీ స్వామి గోకులానందగారు (రామకృష్ణామిషన్ ఢిల్లీ) శ్రీ వసంత సాఠేగారు , శ్రీ కులదీప్‌నయ్యర్ గారు (పత్రికాధిపతి) డా॥ లోకేశ్ చంద్రగారు వేదికపైకి ఆహ్వానింపబడిరి.

ముందుగా శ్రీ మిశ్రాగారు స్వాగతం పలుకగా, శ్రీ గోకులానంద గారు తమ ఉపన్యాసము గావించిరి. ఆ తరువాత వరుసగా శ్రీ వసంత సాఠేగారు శ్రీ కులదీప్‌నయ్యరు గారు డా॥ లోకేశ్ చంద్రగారు వరుసగా తమ తమ ప్రసంగాలు కొనసాగించిరి. ఈ ప్రముఖులు చాలా అరుదుగా సదస్సులకు సమయమిచ్చెదరు. అందరును ఎంతో ఉన్నతమైన రీతిలో భావగాంభీర్యంగా, మానవతా విలువల గురించి, ప్రపంచ పయనం గురించి హింసావాదం గురించి భారతీయ సంస్కృతి పరంపరల గురించి సనాతన ధర్మాల గురించి తమ ప్రసంగముల కొనసాగించిరి. చివరగా ముఖ్య అతిథి శ్రీ జి.వి.జి. కృష్ణమూర్తిగారు, చాలా ఉత్సాహ ఉత్తేజ పూరితంగా, స్వామీజీ గురించి, భారతీయత, భారతీయ సాంప్రదాయాల గురించి, జాతీయత గురించి, భారత భాగవత, రామాయణ, ఉపనిషత్ శ్లోకాలు ఉదహరించుచు చాలా అమూల్యమైన, సదస్సునకుపకరమైన ఉపన్యాసము గావించిరి. ఆ తరువాత శ్రీ మిశ్రాగారు ఉపన్యాసాల గురించి, ఉపన్యాసకుల గురించి, సదస్సు గురించి నేడు జరిగిన కార్యక్రమముల గురించి క్లుప్తంగా వివరించిరి. చివరగా శ్రీ నాగఫణి శర్మగారిని ఆహ్వానించగా వారు సంస్కృతములో వేదికపైనగల సభ్యులందరిపై ఒక్కొక్క శ్లోకముతో కవితనల్లి ఆలపించగా సభికులెల్ల కరతాళ ధ్వనులు చేసి ఆనందించిరి.

దాదాపు 6 గం॥లకు నాటి సదస్సు దిగ్విజయముగా ముగిసినది. సదస్యులెల్లరకు, టీ, కాఫీలు, సేవించి పోవలసినదిగా కోరబడినది.

**17-9-1995** ఉదయం పదిగంటలకు రెండవ రోజు సదస్సు. డా॥ కరణ్‌సింగ్ ముఖ్యఅతిధిగా యేతెంచగా ఆహ్వానించితిమి. వేదికపై శ్రీ రంగనాథ మిశ్రాగారు

డా॥ పాండు రంగారావుగారు. ఇర్వురు స్వామీజీలు, నేనును ఆహ్వానింపబడితిమి. ముందుగా శ్రీ పాండు రంగారావుగారు, తర్వాత డా॥కరణ్‌సింగ్ గారు తమ అమూల్య సందేశములనిచ్చిరి. ఉపనిషత్తులు, భారత, భాగవత, రామాయణములలోని మన సంస్కృతిని శ్లోకాలనుటంకించి వారిచ్చిన ఉపన్యాసములు, చరితార్థములనక తప్పదు. డా॥ పి.వి. గోపాల కృష్ణమూర్తిగారు శ్రీ విశ్వంజీగారి యూనివర్సల్ కాన్సెప్ట్ యనే వ్యాసమును చదివిరి - నాటి సదస్సుకు కొందరు ముఖ్యులు రాలేని కారణంగా, అచటనేయున్న శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్యగారు, శ్రీ కుందుర్తి సత్యనారాయణగారు శ్రీ కె. సీతారాంరావుగారు (E.O. యాదగిరి దేవస్థానం) ప్రసంగించిరి. తరువాత శ్రీ మిశ్రాగారు రెండు రోజాల సదస్సుపై ప్రసంగించి, గుంటూరులో స్వామీజీ నిర్మించు "విశ్వమానవ సమైక్యతా స్థాపమున నొక సెక్రెటరీయేటును, యేర్పాటు చేయనున్నట్లు, తాను స్వయంగా నెలకు రెండు రోజాలు అచటికెళ్ళి స్వామీజీ కార్యక్రమాలను పర్యవేక్షించునట్లుగా ప్రకటించిరి. తరువాత శ్రీ కురుతాళం స్వామీజీ మరియు విశ్వంజీగారు ఆశీఃభాషణం గావించిరి. దాదాపు 2 గం॥లకు భోజన విరామం కొరకు అచటనే అందరికీ యేర్పాటు చేసిన భోజనమునకు ఆహ్వానింపబడిరి.

సాయంత్రం ముగింపు సమావేశమునకు భారత ప్రధాని గౌ॥ శ్రీ పి.వి. నరసింహారావుగారు రానున్న సందర్భంగా భద్రతా కారణాలవల్ల సాయం సదస్సు కాన్సల్ చేయబడినది. కావున అరగంట ముందుగా వచ్చి తమ తను స్థానాలలో ఆసీనులు కావల్సిందిగా కోరడమైనది.

17-9-95 సాయంత్రం 5 గం॥లకు ఆంధ్రభవనం ఆడిటోరియం పైన క్రింద ఆహూతులచే నిండి పోయినది. SPG వారిచే మూలమూలకు, సీటు సీటుకు తనిఖీ చేయబడినది. హాలులో ప్రతి నాల్గు మీటర్లకు SPG వారు నియుక్తులైరి. సరిగా 5 -30 ని.లకు భారత ప్రధాని యేతెంచగానేను పాదాభివందనం చేసి ; శ్రీ మిశ్రాగారితో సహా ఆహ్వానించి తోడ్కొని లోనికి చేరితిమి. ఆహూతులెల్లరు లేచి నిలబడి స్వాగతించిరి. స్వామీజీలను వేదికపైకి సాదరంగా తోడుండి ఆహ్వానించితిని. అందరు వేదికపై ఆసీనులు కాగానే ప్రథమంగా ప్రధానికి పూల గుచ్ఛములతో పాటు మొమెంటో మరియు శాలువాతో సత్కరించితిని. పాప విద్యాలక్ష్మి భగవద్గీత శ్లోకములు వ్యాఖ్యానముతో దాదాపు 10 నిమిషాలు చేసినది. అందరు శ్రద్ధగావిని అభినందించిరి. శ్రీ రంగనాథ మిశ్రాగారు ప్రధానికి సభికులకు, స్వాగత వచనములతో పాటు రెండు రోజాల సదస్సు వివరాలు దాని ప్రాధాన్యతల

గురించి వివరిస్తూ పది నిముషములు ప్రసంగించిరి. ప్రప్రథమంగా భారతదేశానికి భారతీయత, భారత సంస్కృతి ధార్మిక ఆలోచనలు గల ప్రధాని లభించినాడని వక్కాణించిరి. ఆ తరువాత శ్రీ కురుతాళం స్వామీజీ తెనుగులో 5 నిమిషములు చక్కగా మాట్లాడి వారి పూర్వీకులు బ్రహ్మీభూత శ్రీ త్రివిక్రమ రామానందభారతీ స్వాములతో ప్రధానికి గల సాన్నిహిత్యమును జ్ఞాపకమునకు తెచ్చిరి. ఆ తరువాత శ్రీ విశ్వంజీగారు ఆంగ్లంలో ప్రసంగించి, మానవ విలువల, సమైక్యత, శాంతి ఆవశ్యకతలపై వక్కాణించి సభికులెల్లరకు ఆశీస్సులందించిరి. ప్రధానికి శ్రీ విశ్వంజీగారు "స్థితప్రజ్ఞ" "బిరుదును" ప్రసాదించి శంఖుచక్రాలతో భీష్మునిపైకి లంఘించు శ్రీకృష్ణ పరమాత్మలోహవిగ్రహమును సమర్పించి మరియు శాలువాతో సత్కరించి ఆశీర్వదించిరి. తరువాత ప్రధాని విద్యాలక్ష్మివి ఆక్కున చేర్చుకొని గీతోపదేశం, లోహపటము, శాలువా మరియు రు. **1001-00** చెక్కు నొసగి సన్మానించిరి. తదుపరి శ్రీ రంగనాధ మిశ్రాగారిని శ్రీనాగ**ఫణి** శర్మగారిని, శ్రీ రాజశేఖర శర్మ వేద పండితుడిని మొమెంటో మరియు శాలువాలతో వరుసగా ప్రధాని సన్మానించిరి.

ఆ తరువాత భారత ప్రధాని గౌ॥ శ్రీ పి.వి. నరసింహారావుగారు అరగంటసేపు ప్రసంగించిరి. ప్రపంచంలో అణుశక్తి ఉపద్రవమును గురించి వక్కాణిస్తూ, పెక్కు దేశాలు బాంబుల వెంట పరుగిడుతున్నాయని, ఒకరు 20 బాంబులు తయారు చేస్తే మరొకరు వందబాంబులు తయారు చేస్తున్నారని రెండవ ప్రపంచ యుద్ధంలో ఒక బాంబు వినియోగించి వినాశముగావించిరి. ఇన్నిన్ని బాంబులు తయారు చేసిన వేయడానికి తావుండునా యని ఖేదము తెల్పిరి. అణుబాంబుల నిర్మూలన ఒప్పందం కాగితాలపై వ్రాసికొన్నంత మాత్రాన ప్రయోజనం లేదని తేటతెల్లము చేసిరి. ఈ అణుబాంబు నిర్మాణ స్ఫూర్తి మనభగవద్గీత నుండే జనించినదేమోయని, "దివిసహస్ర సూర్య"యను గీతా శ్లోకమునుటంకించి అనుమానము వ్యక్త పరిచిరి. ఏదియేమైనా నాటిభారత సంస్కృతి పునరుద్ధరింపబడాలని, శాంతి సహజీవనము స్థాపించబడాలని మనలాగే విదేశీయులు కొందరు కోరుచున్నారని దానికి దీక్షాదక్షత గల స్వామీజీల ఇలాటి సదస్సుల ఆవశ్యకత యున్నదని నుడివిరి. పలుమార్గాలలో హింసాధోరణులలో పయనించుచున్న నేటి సమాజంలో ప్రపంచ సమైక్యత శాంతి కొరకు నిర్వహించు అపురూప సదస్సులో పాల్గొనుట సంతోషదాయకమని ప్రవచించిరి. భవిష్యత్తులోను ఈలాటి సదస్సుల ఆవశ్యకతను తెలియ చేసిరి.

తరువాత నేను వందన సమర్పణ గావించి నాకు రకరకాలుగా

స్ఫూర్తినిచ్చినవారి నెల్లరకు ధన్యవాదాలు తెల్పితిని.

ఆ తరువాత శ్రీనాగఫణి శర్మగారు ప్రధానిని తెలుగు పద్యములచే ప్రశంసించిస్వస్తి శాంతి వచనములు పలికిరి. సదస్సు దిగ్విజయంగా ముగిసెను. ప్రధాని స్వామీజీల సెలవు తీసుకొని బయలుదేరగా, శ్రీ మిశ్రాగారు నేను వాహనం వరకు యేగి పంపించి వచ్చితిమి. సదస్సు తరువాత ఒక గంట విరామము కాఫీ, టీలకు-ఈయబడెను. చాలామంది నాకు నా సహచరులకు అభినందనలు తెలియ చేసిరి. ముఖ్యంగా శ్రీ జి.వి.జి. గారు,శ్రేయోభిలాషులు, పండితులు, నాతోపని చేసిన కార్యకర్తలు ఎంతో సంతోషముతో అభినందనలు అభివాదములు తెలియ చేసిరి.

ఒక గంట తరువాత సాంస్కృతిక కార్యక్రమము ఢిల్లీలోని ఒక బృందము దేశభక్తి గీతాలపనలతో దాదాపు రెండు గంటలు శ్రోతలను రంజింప చేసిరి. శ్రీ నాగఫణి శర్మగారును, శ్రీమతి సత్యవతియును (హైద్రాబాద్) కూడ కొన్ని పాటలు పాడిరి. హైద్రాబాద్ నుండి యేతెంచి సదస్సు మధ్యలో పాటలు పాడిన వారిలో కుమారి శ్వేత మరియు మధు ముఖ్యులు.

ఈ రెండు రోజుల సదస్సు యొక్క ప్రముఖుల అన్ని ప్రసంగాలు రికార్డు చేయబడినవి. వీనిని ముద్రించి "విశ్వజ్యోతి" భాగం - 2 గా విడుదల చేయబోవుచున్నాము. "విశ్వజ్యోతి" భాగం 1 దాదాపు 25 ప్రముఖుల వ్యాసాలతో 250 పేజీలతో సుందరంగా తయారై నేడు ఉదయం సదస్సులో శ్రీ విశ్వంజీగారి కరకమలములచే విమోచన గావింపబడినది. అంతేకాక 'సర్వార్థ సంక్షేమ సమితి' లో కార్యక్రమాల మరియు ఈ నాల్గు రోజుల మహాయజ్ఞపు ఫొటోలతో కొన్ని ముఖ్యమైన ఆగమ ప్రసంగాలతో రకరకాల ప్రకటనలతో, చక్కని కవరుతో, సావనీరు "విశ్వకిరణం 2" పేరుతో నిన్న ఉపరాష్ట్రపతి గారిచే విడుదల చేయబడినది. కావలసినవారు "సర్వార్థ సంక్షేమ సమితి" 501 ప్రదీప్ అపార్ట్‌మెంట్ గాంధినగర్ - హైద్రాబాద్ 380 చిరునామాకు వ్రాసి తెప్పించుకోగలరు. కార్యక్రమాలు మొత్తం దాదాపుగా ఆంగ్లంలో, సంస్కృతంలో జరిగినవి. కావున పుస్తకాలు, ఆంగ్లంలోనే ముద్రించబడినవని వేరే తెలుప వలసిన పనిలేదు.

సెలవు
పి.వి. మనోహరరావు
చేర్మన్
స.స.స

"సర్వేజనా: సుఖినోభవంతు"



16-9-1995 న హైదరాబాద్ సర్వార్థ సంక్షేమ సమితి ఆధ్వర్యంలో న్యూఢిల్లీ
A.P.Bhavan ఆడిటోరియంలో జరుగుచున్న గోష్ఠిని జ్యోతి వెలిగించి
ప్రారంభిస్తున్న భారత ఉపరాష్ట్రపతి గౌ.కె.ఆర్.నారాయణన్ సర్వార్థ సంక్షేమ సమితి
అధ్యక్షులు, శ్రీ పి.వి.మనోహర్‌రావు మరియు జస్టిస్ రంగనాథ్ మిశ్రా, మానవ
హక్కుల కమీషన్, ఛైర్మన్ కూడా ఉన్నారు



16-9-95 న మానవవిలువలు విశ్వశాంతి సందర్భంలో శ్రీ విశ్వంజీ,
శ్రీ కె.ఆర్.నారాయణన్‌గారు మరియు పి.వి. మనోహర్‌రావు తదితర సభ్యులు




17-9-95 న సదస్సు ముగింపు సమావేశంలో పాల్గొన్న
గౌ.శ్రీ పి.వి.నరసింహారావుగారు భారత ప్రధానమంత్రి. కుడివైపు శ్రీ కుర్తాళం
స్వామీజీ, ఎడమన శ్రీ విశ్వంజీ మరియు పి.వి.మనోహర్‌రావు




17-9-95 న భారత ప్రధాని చిII విద్యాలక్ష్మిని
(భగవద్గీత వ్యాఖ్యానము చేసినందులకు) సన్మానిస్తున్న సన్నివేశము
శ్రీ రంగనాథమిశ్రా. శ్రీ కురుతాళం స్వామీజీలు వారికి కుడివైపు
మరియు శ్రీ విశ్వంజీ మరియుపి.వి.మనోహర్‌రావు ఎడమవైపు

# అనుభవతరంగిణి

(గత సంచిక తరువాయి)

శ్రీ జి.వి.యల్.యన్.విద్యాసాగరశర్మ

"జైజై గురుదేవా! శ్రీవిశ్వమహాదేవా!
జైజై గురుదేవా! శ్రీదత్తమహాదేవా!
బ్రహ్మవిష్ణు మహేశ్వరా! దత్తమహాదేవా!"

ప్రతి గురువారం, ఆదివారం సాయం సంధ్యాసమయంలో తన పిల్లల్ని తీసుకొని ఒక ఇల్లాలు విశ్వమందిరానికి వచ్చి, మాస్టరుగారికి భక్తి ప్రపత్తులతో నమస్కరించి, వినయంగా, దూరంగా ఒక మూల వొదిగి కూచోవటం, మాస్టరుగారు ఆవిడ వంకసాదరంగాచూచి, చిరునవ్వు చిందిస్తూ "పాడు!" అని తలవూపటం, ఆ అమ్మాయి పవిటి వొంటి నిండా కప్పుకొని, గొంతెత్తి సన్నగా, కమ్మగా, కమ్మచ్చునుంచి తీగెతీసినట్లు తన్మయత్వంతో కళ్ళు మూసుకొని "జైజై గురుదేవా!" అంటూ పాడటం, మాస్టరుగారు నిమీలితాక్షులై ఆపాటలోని భావగాంభీర్యాన్ని ఆస్వాదిస్తూ ఉండటం విశ్వకుటుంబ సభ్యులకు సుపరిచితమైన విషయం. మాస్టరుగారిని దత్తగురు స్వరూపంగా భావిస్తూ హృదయపూర్వకంగా ఆరాధిస్తూ, మరింతగా వారి అభిమానాన్ని చూరగొంటున్న ఆ అదృష్టవంతురాలే "శ్రీమతిరమణ!"

రమణస్వగ్రామం విశాఖ జిల్లాలో, ఎక్కడో మారుమూల ఉన్న "వరహాపురం" అనే గ్రామం. ఆ పల్లెటూళ్ళో నివసిస్తున్న ఆమె తన పిన తల్లుల ద్వారా మాస్టరుగారి పేరు వింది. ఆ తర్వాత ఆమె భర్త గారు, కాకాగారూ, మామ్మగారూ గుంటూరు అనేక పర్యాయాలు రావటం, విశ్వయోగి ఫొటో, వెండిప్రతిమ, వెండి పాదుకలు, విభూతి ప్రసాదం ఆమెకిచ్చి, పూజలో పెట్టి, పాదుకలకూ ప్రతిమకూ అభిషేకంచేస్తూ ఉండమని చెప్పటం జరిగింది. ఆమె వాళ్ళు చెప్పినట్లు చేస్తుండేది. ఒకగురువారం ఆమె అభిషేకం చేస్తూ "ప్రభూ! మిమ్ములను గురించి, మీమహిమలను గురించి వినడమేగాని, మిమ్మల్ని కళ్ళారాచూచే భాగ్యం నాకింత వరకు కలుగలేదు. ఇంట్లో వాళ్ళనందర్నీ నీదగ్గరకు పిలిపించుకొని చక్కగా మాట్లాడావు. ఆ అదృష్టంనాకెప్పుడు ప్రసాదిస్తావ్ స్వామీ! అని అనుకొంది తనలో. తత్ఫలితమే అనతికాలంలో ఆమె పిల్లల చదువుకోసం గుంటూరు రావడం, ప్రతిగురువారం,

ఆదివారం మాస్టరుగారు ఆమెచేత "జైజైగురుదేవా!" పాడించుకోవడం, విశేషానుగ్రహం వర్షించడం.

ఒకసారి రమణ తాతగారి కంటికి ఆపరేషన్ చేశారు. ఆ ఆపరేషన్ జరిగినప్పటి నుంచి ఆయన చాలా చిరాగ్గా ఉండేవాడు. ఎవరికీ అంతుబట్టని అనారోగ్యం ఆయనకు పట్టుకొంది. బాధకు తట్టుకోలేక పోయేవాడు. ఎవరన్నా గుంటూరు వెళ్ళుతున్నారని తెలిస్తే చాలు!" ఈ బాధ భరించలేక పోతున్నాను. నా అవస్థ మాస్టరుగారికి చెప్పి- దయచూపించమనండి!" అని మొరపెట్టుకొనేవాడు. తనబాధ మాస్టరుగారు తప్ప మరెవ్వరూ తీర్చేదికాదని ఆయన ప్రగాఢ విశ్వాసం. అక్కడ వరహాపురంలో అవృద్ధుడు బాధ పడుతున్న సమయంలో రమణ గుంటూరులో ఉండేది. పిల్లల చదువులకోసం.

ప్రతిగురువారం విశ్వమందిరానికి వెళ్ళినట్లే ఆ గురువారం రమణ విశ్వమందిరానికి వెళ్ళింది. వాళ్ళబాబును తీసుకొని. మాస్టరుగారు ఆపిల్లవాళ్ళ దగ్గరకు పిలిచి, వొళ్ళోకూచోబెట్టుకొని "మీతాతకు ఏమీ ఫరవాలేదు - కంగారు పడవద్దని చెప్పు. నా బ్లెస్సింగ్స్ ఉన్నాయి" అన్నారు. ఆవేదవాక్కు ప్రకారం ఎనభైఏళ్ళుపై బడిన రమణ తాతయ్యా గారి ఆరోగ్యం కుదుటబడింది. ఈనాడాయన పూర్వం మాదిరిగానే తను వ్యవసాయపనులు తాను చూచుకొంటూ ఉత్సాహంగా తిరుగుతున్నాడు.

రమణ గర్భం ధరించింది. పదినెలలు నిండాయి. నొప్పులు వస్తుంటే ఆమెను హాస్పటల్లో చేర్పించారు. డాక్టరుగారు ఆమెను పరీక్షించి "పొజిషన్ క్రిటికల్‌గా ఉంది. సిజేరియన్ ఆపరేషన్ చేయాలి" అన్నాడు. ఆపరేషన్ అనంగానే రమణకు భయం వేసింది. "విశ్వసాయిదేవా! నామొరాలకించరావా!" అని భజన పాటపాడుకొంటూ, మాస్టరుగారిచ్చిన విభూతి ముఖాన పెట్టుకొని, కొంచెం పొట్టకు రాచుకొని, "స్వామి! ఆపరేషన్‌తో పనిలేకుండా చేసి సుఖప్రసవం ప్రసాదించు!" అని దీనంగా వేడుకొంది. శ్రావణ శుక్రవారంనాడు ఆపరేషన్‌తో నిమిత్తంలేకుండా - ఆమె ప్రసవించింది. ఆడపిల్ల పుట్టింది. ఆపిల్లకు "విశ్వసాయికమల" అని పేరుపెట్టుకొంది. తొమ్మిదవ నెలలో మాస్టరుగారు ఆపిల్లకు అన్నప్రాశన చేస్తూ" ఆవకాయ అన్నంబాగాతిను!' అని వేళాకోళంగా నవ్వుతూ అన్నారు. ఆపాపకి ఆవకాయ అన్నం అంటే ఇప్పుడు చాలా యిష్టం. వాళ్ళమ్మ అన్నంలో ఆవకాయ వెయ్యకపోతే " అన్నంతిన" నని మారాంచేస్తూ ఉంటుంది.

శ్రీమతి రమణ మొట్టమొదటి నుంచి సత్యసాయి బాబాభక్తురాలు. శ్రీవిశ్వయోగివిశ్వంజీలో సత్యసాయిని దర్శించి విశ్వసాయిగా ఆరాధిస్తూ ఉంటుంది. ఆరోజు గురువారం. "విశ్వంజీ ప్రభూ! సత్యసాయిని నేను ఆరాధిస్తున్నాను. మీ ఇద్దరికీ భేదం లేదనుకొంటున్నాను. ఇదే నిజమైతే ఈరోజు నీదర్శనం ప్రసాదించి, నీపాదనమస్కారం చేసుకొనే భాగ్యం కలిగించు!" అని విశ్వంజీక్ మొక్కుకొంది. ఆరోజు రాత్రి బాబా, విశ్వంజీ ఇద్దరూ ఆమెకు కలలో కనిపించారు. ఇద్దరూ పాదనమస్కారాలు ప్రసాదించారు. విశ్వంజీ "అమ్మాయ్! పాట పాడు!" అని, ఆమెచేత "జైజై గురుదేవా!" పాడించుకొన్నారు.

మాస్టరుగారు ఆమె కుటుంబంలోని వాళ్ళందరికీ ఆరోగ్యం ప్రసాదించి, మనశ్శాంతిని చేకూర్చి, వాళ్ళనిలయాన్ని ఆనంద నిలయంగా మార్చిన దాఖలాలు ఎన్నో ఉన్నాయి. అనారోగ్యంతో బాధపడుతున్న అత్తగారికీ, అమ్మగారికీ రమణ గురువారం పూజలో కూచోని "ఓంశ్రీసాయిరాం గురుదేవదత్త" మంత్రాన్ని 108 సార్లు జపించి, తీర్థం, విభూతి ఇవ్వగానే స్వస్థత చేకూరుతుండేది. మాస్టరుగారు చెప్పినట్లు మెంతిపొడి మజ్జిగలో కలిపి రోజు వాళ్ళకు ఇస్తుంటే క్రమంగా ఆరోగ్యం చేకూరటం జరిగింది. "విశ్వయోగిని గూర్చి నీ అభిప్రాయమేమిటి?" అని అడిగితే, "యోగస్వరూపులు, జ్ఞానస్వరూపులు, శాంతస్వరూపులు, ప్రేమ స్వరూపులు, దత్తావతారులైన శ్రీవిశ్వంజీ" అని అంజలిఘటిస్తుంది పరమభక్తురాలైన రమణ.

మరో భక్తుడి అనుభవం చూద్దాం. శ్రీసన్నపనేని కృష్ణారావు మంగళగిరికి దగ్గరగా ఉన్న "మలకపురం' అనే ఊళ్ళో ఉంటున్నాడు. ఆయన సన్నకారురైతు. మాస్టరుగారి భక్తుడు. వాళ్ళబ్బాయి పెళ్ళికి ఆయన మాస్టరుగారిని పిలిచాడు. అది మారు మూల పల్లెటూరని కూడా చూడకుండా, ఆయన భక్తికి కట్టుపడి మాస్టరుగారు ఆ పెళ్ళికి వెళ్ళారు. అక్కడ నూతన దంపతులతో బాటు కృష్ణారావు దంపతులు కూడా మాస్టరుగారికి పాదపూజ చేశారు. మాస్టరుగారికి పల్లెటూరికి పోవడమంటూ అదేప్రథమం. గతసంవత్సరంనుంచి వర్షాలు లేక, తాగడానికి నీళ్ళులేక, పంటలు పండక, ఊళ్లో జనంచాలా అవస్థ పడుతున్నారు. మాస్టరుగారు ఆ ఊరువచ్చి అటువెళ్ళారో లేదో ఇటు నుంచి మేఘాలు కమ్ముకొనివచ్చి, కుండ పోతగా వర్షంకురిసి అందరికీ హర్షం కలిగించింది. "ఆనాడు రోమపాదుని రాజ్యంలో ఋష్యశృంగమహర్షికాలుపెట్టగానే వర్షాలు పడి, కరవుకాటకాలు మటు మాయమై

పోయినవని రామాయణ కథలో వినటమేకాని ఈనాడు దత్తావతారులు శ్రీవిశ్వయోగి విశ్వంజీ మహారాజ్ మనవూళ్ళో కాలుపెట్టగానే నీటి కరువుతీరిపోయిందని ఊళ్ళోవాళ్ళంతా సంతోషించారు. ఆనాడు కురిసిన వర్షానికి చెరువులూ, దొరువులూ నిండాయి. ఆ సంవత్సరం పంటలు కూడా బాగా పండాయి. ఈ లీల చూచినప్పటినుంచి కృష్ణారావుకు మాస్టరుగారిపై మరింత నమ్మకం, భక్తి శ్రద్ధలు రేకెత్తాయి.

ఒకసారి కృష్ణారావుకు కడుపులో నొప్పిరావటం మొదలు పెట్టింది. ఏమి తిన్నా, తాగినా నోట్లోనుంచి వెళ్ళిపోయేది కడుపులో ఇమడక. ఈసంగతి మాస్టరుగారికి చెప్పకుండా చాలాకాలం "అదే తగ్గిపోతుందిలే' అని నిర్లక్ష్యంచేశాడు. తర్వాత ఆబాధ భరించలేక డాక్టర్లకు చూపించి మందులువాడాడు. ప్రయోజనం కనిపించలేదు. అప్పుడు మాస్టరుగారు గుర్తుకువచ్చి, దర్శనానికివచ్చాడు. మాస్టరుగారి ఆయన్ను చూచి "వెంటనే డాక్టరుమద్దినేనిగోపాలకృష్ణయ్యకు చూపించు!" అన్నాడు. ఆ డాక్టరుగారు ఆయన్ను పరీక్షించి "ఇక్కడలాభంలేదు. హైదరాబాదు వెళ్ళండి. అక్కడ ఆపరేషన్ చేస్తారు." అని చెప్పాడు. మాస్టరుగారి ఆశీస్సులు తీసుకొని ఆయన హైదరాబాదు వెళ్ళాడు. అక్కడ డాక్టర్లు ఆయన్ను పరీక్షించి "కడుపులో పేగు చిట్లింది. దాన్ని కత్తిరించి మళ్ళీకలపాలంటే ప్రాణానికి అపాయం. ఆపరేషన్ చెయ్యం" అన్నారు. కృష్ణారావుకు భయంవేసింది. మాస్టరుగారికి ఫోన్‌చేసి, విషయమంతా చెబితే మాస్టరుగారు "ఏం ఫరవాలేదు. డాక్టర్లకు చెప్పి ఆపరేషన్ చేయించుకో!' అని ఆశీస్సులిచ్చారు. మాస్టరుగారి మాటలు వినంగానే ఆయనకు ఎక్కడలేని ధైర్యంవచ్చింది.' ఈ ఆపరేషన్ నా సమ్మతి మీద నేనే చేయించుకొంటున్నాను. దీనితో డాక్టర్ల కెటువంటి ప్రమేయంలేదు. సంపూర్ణబాధ్యత నాదే" నని పూచీ కత్తువ్రాసిచ్చి, డాక్టర్లను ఆపరేషన్ చెయ్యమన్నాడు. ఆపరేషన్ జరిగింది. జానెడు పొడుగు పేగును కత్తిరించి, తీసివేసి, మళ్ళీ ఆపేగును కలిపికుట్టారు. ఆపరేషన్ విజయవంతమైంది. ఇప్పుడాయన పరిపూర్ణమైన ఆరోగ్యంతో తన పనులు తాను చేసుకొంటూ హాయిగా -తిరుగుతున్నాడు. మాస్టరుగారి దయవల్ల పంటలు బాగాపండుతున్నందువల్ల చేసిన అప్పులన్నీ తీర్చివేశాడు.

*(సశేషం)*

# చీకటి వెనుక

డా. పోతుకూచి సాంబశివరావు

చుట్టూవున్నది చీకటిరాతిరి
చూడ కనులకు వెలుగులు లేవు
కనులుమూసినా, కనులుతెరిచినా
కనపడు చీకటీ, చీకటియే
మనిషి బతుకులే చీకటి చీకటి
ఇనుడు మాయమవ చీకటి చీకటి
చంద్రుని జీవిక సగం చీకటి
తారలు మెరియగ కావలె చీకటి
భూమిపోరలలో చీకటి చీకటి
సముద్రకెరటముల చీకటి చీకటి
చెట్ల ఆకులను చీకటి చీకటి
విశ్వవ్యాప్తమయె చీకటి చీకటి
చీకటి ఏమిటి? చింత చేయగా
వెలుగులగర్భము కలిగిన రాతిరి
బాధలుతొలగును, బోధలు[illegible]గులును
బోధ హృదయమే, జ్ఞానోదయము

# గురుపూర్ణిమ-మధురస్మృతులు

శ్రీమతి కే. సుగుణమణి
ఆంధ్ర మహిళాసభ అధ్యక్షురాలు

"దీన శుభము లేదు దివ్యకీర్తియులేదు, జగతిపుట్టిపుట్టి చచ్చిచచ్చి పొరలనేల మనకు బుట్టని చావని త్రోవ వెదకి కొనుటె దొడ్డబుద్ధి"-

పైది ఒక జిజ్ఞాసా పిపాసుని దివ్యప్రబోధము! మహోత్కృష్టమైన మానవ జన్మ వచ్చినందుకు అమూల్యమైన జీవిత కాలమును వృధాపుచ్చి యీమూన్నాళ్ళ బ్రతుకు ముక్కలు చేసుకోకుండా సద్వినియోగం చేసుకోటానికి యత్నించాలి. అందుకు ఎరుక గల పెద్దల సన్నిధికి వెళ్ళి వారి వద్ద యుక్తాయుక్త వివేక జ్ఞానమును సముపార్జించాలి. ఆ సంకల్పముతో నేను పసితనం నుండి కూడ మా తల్లి తండ్రుల సుశిక్షణలో పెరిగి ఆ తర్వాత ఎందరో మహాపురుషులను సందర్శించడం, వారి బోధనలు వినటం, విన్నది

కొంతైనా ఆచరించటానికి ప్రయత్నించటం జరుగుతున్నది.

వివాహమైన తరువాత కూడ భర్తగారి ప్రోత్సాహం, శ్రీమతి దుర్గాబాయమ్మగారి సహచర్యం వల్ల ఉడుతాభక్తితో ఆమె నిర్వహించే సేవా కార్యక్రమాల్లో పాల్గొని 'మానవసేవేమాధవ సేవ' అని విశ్వసించటం వల్ల నా జీవితాన్ని మానవ సేవకే అంకితం చేసుకున్నాను. చిన్ననాటి నుండి నా పద్ధతి ఏమిటంటే మహాత్ములను సందర్శించి నప్పుడు దూరంగా వుండి నమస్సులు అర్పించుకుని వారు యిచ్చిన సందేశాన్ని నెమరు వేసుకుంటూ రావటమే తప్ప వారితో పరిచయం చేయించు కొవటం అలవాటు లేదు.

అలా ఎందరో మహాత్ములను, మాతృదేవతలను సందర్శించటం, వారి బోధనలు జీర్ణించు కోవటం జరుగు తున్నది. ఈ 74 సం॥ల జీవితంలో. అయితే ఈ 1995 సం॥ ప్రారంభంలోనే మాసోదరి అరవిందాదేవి హైదరాబాదు రావటం సంభవించింది, దైవికంగా. ఆమె చిరకాలంగా ఆధ్యాత్మిక చింతనతోనే వుంటూ అనేక యజ్ఞయాగాదులలో పాల్గొంటూ జీవిత సత్యాన్ని తెలుసుకున్న మాత! ఆమె మాదగ్గర వుండగా స్వామి విశ్వయోగి విశ్వంజీ హైదరాబాదులో వున్నట్లు తెలిసింది. అంతే మా అందర్నీ ప్రయాణం చేయించి వారి సన్నిధికి తీసుకు వెళ్ళింది. వారి చుట్టూ అంతా భక్తులే. స్వామికి పాదాభివందనాలు చేసుకుని వారి ఆశీస్సులు అందు కుంటున్నారు. నేను మాత్రం అలవాటు ప్రకారం దూరం నుండే నాహృదయ పూర్వక నమస్సుమాంజలి అర్పించు కుంటు న్నాను. ఇంతలో మా చెల్లెలు స్వామి ముందుకు తీసుకు వెళ్ళి నన్ను పరిచయం చేయబోయింది. అంతే స్వామి నన్ను ఎప్పటి నుండో పరిచయమున్నట్టు దగ్గరకు తీసుకుని మాతృవాత్సల్యాన్ని మరపించేరీతిని శిరస్సు పై ఆశీర్వదించి, పాదనమస్కారం యిచ్చి, పూలదండ నా మెడలో వేసి ఆశీర్వదించారు. నేను నిస్వార్థ, నిష్కామ కర్మ చేస్తున్నానని, యింకా ఎంతో చేయనున్నానని ప్రశంసించారు. నాకు తన్మయత్వంలో శరీరం గగుర్పొడిచింది. నోటమాట రాలేదు. హృదయం అవ్యక్తమధురానందంతో నిండిపోయింది. అది కలా నిజమా అని మనస్సువూగిసలాడింది. ఇంతలో అంతా స్వామి వద్ద శెలవు తీసుకుంటుంటే మేము కూడ వారి ఆజ్ఞతీసుకుని ఇంటికి చేరుకున్నాము. కాని ఆ రాత్రంతా ఏదో వ్యక్త పరచలేని మధురానుభూతి-అది అనుభవైకవేద్యమే కాని మాటలతో మనవి చేయలేని ప్రశాంతత!

తిరిగి మే మాసంలో స్వామిజీ హైదరాబాదు వచ్చినట్లు తెలుసుకుని వారి దర్శనార్థంమేమంతా వెళ్ళాము. మా చెల్లెలు వెళ్ళి పోయింది. నన్ను

చూచిన వెంటనే గుర్తు పట్టి పిలిచారు. నాకు పాద నమస్కారం లభించింది. నన్ను ఆశీర్వదించి. మీ మహిళాసభ ఏకార్యక్రమాలు చేస్తుంది అని అడిగారు.

స్త్రీశిశు సంక్షేమానికి శ్రీమతి దుర్గాబాయమ్మగారు చేపట్టిన 50 కార్యక్రమాల గురించి క్లుప్తంగా చెప్పాను. చాల సంతోషించారు. ఈ సారి గురు పౌరమినాడు నిన్ను కూడ సన్మానిస్తాము అన్నారు. నాకు ఏమి చెప్పాలో తోచలేదు. దైవాజ్ఞగా స్వీకరించి మనస్సులోనే యీ అవ్యాజ ప్రేమకు కృతజ్ఞతలు తెల్పుకుంటూ శెలవు తీసుకున్నాను. జూలై 4వ. తేదిని నాకు ఆహ్వాన పత్రిక యిచ్చారు. 12వ. తేది ఉత్సవాలు. స్వామి ఆజ్ఞ ప్రకారం 11వ. తేదిని మాజయని తీసుకుని గుంటూరు చేరుకున్నాను. అప్పటికే మా చెల్లెలు అరవింద, తమ్ముడు రామారావు వచ్చి వున్నారు. మేమంతా కలిసి ఆరాత్రి స్వామిని దర్శించు కొవటానికీ విశ్వమందిరానికి వెళ్ళాము. నన్ను 'సుగుణమణీ' అని పిలిచి ఈ పేరు ఎవరు పెట్టారు? అని ఎంతో వాత్సల్యంతో పలకరించి దగ్గరకు తీసుకుని ఆశీర్వదించారు. భక్తులందరికీ పాద నమస్కారం యిచ్చారు. వచ్చిన వారందరినీ 12 ఉదయం 7.30 గం॥లకే వారి సన్నిధికి రమ్మన్నారు. ఆ ప్రకారమే అంతా ఉదయం చేరుకున్నాము. ఇక్కడ పూజ కార్యక్రమం ముగించుకుని కొందరు బస్సులో కొందరు కార్లలో స్వామిజీ కారు వెనుక బయలుదేరి గుంటూరుకు 16 కిలో మీటర్ల దూరంలో వున్న 'విశ్వనగర్' కు చేరుకున్నాము. పొలిమేరలో స్వామిజీని మంగళవాయిద్యాలతో, పూర్ణకుంభంతో స్వాగతం పలికారు. చుట్టుప్రక్కల గ్రామాల నుండి స్త్రీలు, పురుషులు తండోపతండాలు గా వచ్చి వేచివున్నారు. విశ్వనగర్ 10 ఎకరాల సువిశాలమైన ప్రదేశం.

ఇందులో విశ్వమానవ సమైక్యతా స్థూప నిర్మాణం జరుగు తున్నది. సత్యం, శీలం, ఐకమత్యం, పవిత్రత అనే నాలుగు గుణాలు నాలుగు ముఖాలు. మానవులంతా ఏకీకృతం కావటమే ఈ స్థూపం అందించే సందేశం. దీనితో బాటు యింకా అష్టసిద్ధి వినాయకుడు ఆడిటోరియం, వృద్ధులకు చక్కటి ఆశ్రయం, శాంతికుటీరాలు. అత్యంత ఆధునిక పరికరాలతో ఆసుపత్రి యిలా ఎన్నో కట్టడాలు వెలుస్తున్నాయి. గ్రామాల్లో గ్రామవికాస కేంద్రాలు నెలకొల్ప బడుతున్నాయి.

గురుపూర్ణిమ మహోత్సవ సందర్భంలో . అభయ ఆంజనేయ స్వామి వారి విగ్రహ ఆవిష్కరణ జరిగింది. సరిగా 10.30గం॥లకు గురుపూర్ణిమ సందేశ సభ ప్రారంభించారు. ఆ సభకు డా.ప్రసాద రాయకులపతి అధ్యక్షత వహించారు. ఎందరో అనేక రంగాలలో నిష్ణాతులైన సోదరీ సోదరులకు ఆశీః పూర్వక సన్మానాలు జరిగాయి. ఆ సభావేదిక గురుమహారాజ్ విశ్వంజీతో

పాటు అనేక మంది మహనీయులతో కనుల పండువగా విరాజిల్లింది. పెద్దల ఉపన్యాసాల అనంతరం విశ్వంజీ ఒక్కొక్కరిని పేరు పేరునా పిలిచి. పట్టుశాలువాలతో, వెండిపాదుకలతో, నవరత్నహారాలతో స్వహస్తాలతో సత్కరించి పుష్పరేకులు శిరస్సులపై చల్లి ఆశీర్వదించారు. నాకు ప్రత్యేకంగా ఒక పట్టు పువ్వుల దండ ఇచ్చి శ్రీ.మతి దుర్గాబాయమ్మ గారి ఫోటోకు వేయమని చెప్పారు. ఈ కార్యక్రమమంతాతిలకించాక నాకు అనిపించింది- మేమంతా పూర్వజన్మలో ఎంత పుణ్యం చేసుకున్నామో ఈ Living God ఆశీస్సులు అందు కోవటానికి అని!

మేమంతా కృతజ్ఞతలు తెల్పుకునే అవకాశాన్ని కూడ కల్పించారు. అయితే **'When the heart is full the words are few'** అన్నట్లు, ఏమి చెప్పాలో, ఎలా వ్యక్త పరచాలో తోచలేదు. గురుకృప ఎప్పుడు ఏరూపంలో మనకు లభిస్తుందో ఆ పరమపితే నిర్ణయిస్తాడు. మనవంతు నిష్కామంగా కర్మ పరార్థం ఆయువును ఉపయోగించ గలగాలి. విశ్వయోగి విశ్వంజీ నాబోటి సామాన్యులను ఆశీః పూర్వక సత్కారం అనుగ్రహించటం. నీవు ఇతరుల కోసం బ్రతికితే నేను నీబాధ్యత పూర్తిగా వహిస్తాను. అన్న కృష్ణ పరమాత్మ వాగ్దానాన్ని అక్షర సత్యం చేస్తున్నారు. శ్రీవిశ్వయోగి నా బోటిసంఘ సేవకులను ప్రజాసేవలో వినియోగించమని అర్థిస్తూ వారికి నాసేవాంజలి ఘటించాను.

ఆ తర్వాత గురుపాదులు విశ్వంజీ గురుపూర్ణిమ సందేశాన్ని అందిస్తూ యిలాప్రబోధించారు. పూర్వజన్మ సుకృతంగా లభించిన మానవజన్మను మనం సద్వినియోగం చేసుకోవాలి. తల్లిదండ్రులు బిడ్డలకు సద్బోధ చేయాలి. వారిలో ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించాలి. ఆత్మవిశ్వాసం మనుష్యుల్ని భౌతికంగాను, మానసికంగాను ఉన్నతుల్ని చేస్తుంది. మనిషి ఎప్పుడూ లోకహితాన్నే దృష్టిలో పెట్టుకుని చక్కటి విషయ పరిశీలనా జ్ఞానాన్ని సంపాదించుకోవాలి. పరిపూర్ణ మానవత్వమే దివ్యత్వము. యావత్ మానవ జాతి అభ్యున్నతికి, సమైక్యతకు, సమగ్రతకు అంతాకృషి చేయాలి. విశ్వమంతా వసుధైక కుటుంబముగా భావించి సర్వేజనా సుఖినోభవంతు అని మానవ కళ్యాణం కోసం అంతాత్యాగం చేయాలి. అలా చేసిన నాడు 2010 వ సం. రానికి ప్రపంచ దేశాలలో భారత దేశం అన్ని రంగాలలో ప్రథమ స్థానంలో వుంటుంది. మన దేశ సంస్కృతి, సాంప్రదాయాలను ఇతరదేశాలు ఆదర్శంగా తీసుకుంటున్నాయి అన్నారు. భరత మాత గౌరవాన్ని మనమంతా నిలబెట్టాలి అని ఎంతో ఉద్వేదంతో తమ ప్రబోధాత్మకమైన ప్రేమామృతాన్ని పంచిపెట్టారు.

**Have faith in yourself! Have faith in god?**

# ఆదిశంకర జన్మభూమి క్షేత్రం కాలడి

డాక్టర్. మల్లీప్రియ "నాగరాజు"

వాసనా శూన్యులై ప్రశాంత చిత్తులైన మహాత్ములు వసంత ఋతువులాగా లోకోపకారం చేస్తారు. భయంకరమైన సంసారార్ణవాన్ని తాము తరించి, నిర్హేతుక కటాక్షంతో ఇతరులను కూడా తరింప చేస్తారు. సూర్యుని ప్రచండ కిరణాలచేత తప్తమైన భూమిని, చంద్రుడు తన అమృత కిరణాలచేత రక్షించే విధంగా, సంసార తాప తప్తులైన జనులయొక్క శ్రమను నివారించడమే మహాత్ముల సహజ లక్షణం. భారతదేశంలో జన్మించి, సమస్త ప్రపంచానికి వెలుగు జూపిన మహా పురుషులలో శంకరాచార్యుల వారు అగ్రగణ్యులు.

32 సంవత్సరాలే జీవించినా, 32 కోట్ల యుగాలకు సరిపోయే జ్ఞానాన్ని ప్రజలకు పంచి పెట్టారు. శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు. జగన్మేధాశాలురలో ఆయన అగ్రగణ్యుడనేది నిర్వివాదాంశం.

శంకరాచార్యుని పవిత్ర నామం స్మరించగానే అఖండ భక్తి స్వరూపం, అద్వితీయ జ్ఞాన ప్రకాశం, అనుపమాన నిష్కామకర్మ, యోగ ప్రతిభ, మహాద్భుత విశ్వప్రేమ, సత్యమైన జీవిత స్వరూపం మనకు గోచరిస్తాయి. భౌతికవాద తర్క సంకులమైన నేటి కాలంలో మానవుని దైవపథంలో నిలుపటానికి శంకరుని దివ్య ప్రబోధాలకు అనుపమానమైన సామర్థ్యం ఉంది.

శంకరులు దుఃఖము యొక్క మూలాన్ని పెరికి వేసారు. సమస్త దుఃఖాలు ఏ అజ్ఞానభూమికపై ఆధారపడి వున్నవో, ఆ శోకమూలాన్ని ఎదుర్కొన్నారు.

కేరళ రాష్ట్రంలోని కాలడిలో శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు క్రీస్తుశకం **788**లో వైశాఖ శుద్ధ పంచమినాడు జన్మించి, తమ 32వ ఏట హిమాలయ **నిబిడారణ్య** గర్భంలోని కేదారనాథ్‌లో గల దత్తాత్రేయ గుహాలో క్రీ.శ. **820లో** మహానిర్యాణమందారు. కానీ కొందరు శంకరాచార్యుల వారు క్రీస్తుపూర్వం 508లో జన్మించి, క్రీ.పూ. 476లో నిర్యాణం చెందారని చెబుతున్నారు. ముఖ్యంగా కంచి కామకోటి పీఠం ఈ వాదాన్ని బలపరుస్తోంది.

“జిన విజయం” సంస్కృత గ్రంథాన్ని నేను.కూలంకషంగా పరిశీలించాను. ఈ గ్రంథం ప్రకారం లెక్కవేస్తే శంకరులు క్రీస్తుపూర్వం 509లో నందన నామ సంవత్సర వైశాఖ శుద్ధ పంచమినాడు జన్మించి, క్రీ.పూ. 477లో సిద్ధి పొందినట్లు తెలుస్తోంది. (కంచికామకోటి వారి లెక్కకు ఒక్క సంవత్సరం తేడా). క్రీ.పూ. 494లో శంకరులు కుమారిల భట్టును కలసుకొన్నట్లు “జినవిజయం” చెబుతోంది. కానీ శంకరులు కలుసుకొన్న కుమారిలభట్టు “జినవిజయం” చెప్పే కుమారిలభట్టు ఒకరుకారు.

1991 నుండి “ఆదిశంకర జన్మభూమి కాలడి”పై పరిశోధన చేస్తున్న నేను ఎన్నో సంస్కృత, మళయాళ గ్రంథాలను పరిశీలించాను. సంస్కృత భాషలో ప్రామాణిక గ్రంథంగా పేర్కొనబడే “శంకరమందార సౌరభం” శంకరులు క్రీస్తు శకం 788-820 మధ్యవారేనని తెలియ చేస్తోంది.అలాగే వ్యాసాచలయతి రచియించిన “శంకర విజయం” సారస్వత సదానందుని “శంకర దిగ్విజయసారం” విద్యారణ్యులవారి “శంకర విజయ విలాసం” గోవిందనాథుని “కేరళీయ శంకర విజయం”, “శ్రీ మత్సంకర విజయం” - ఇవన్నీ ఆది శంకరులు మొన్న 8వ శతాబ్దపు వారేనని (క్రీస్తుశకం 788-820) పేర్కొన్నాయి.

అంతేకాదు “సౌందర్యలహరి”లో శంకరులు పార్వతి వద్ద పాలు త్రాగిన ద్రవిడ శిశువును వర్ణించారు. శంకరులకు కొంచెం పూర్వం క్రీ.శ 7వ శతాబ్దానికి చెందిన తిరుజ్ఞాన సంబంధునకు ఇది వర్తిస్తోంది. అలాగే శంకరులు కలుసుకొన్న కుమారిలభట్టు క్రీస్తుశకం 700 తర్వాత వాడేనని ప్రాచ్య [illegible] విశారదుడగు ఎ.బి. కేథ్ తేల్చివేసారు. అసలు “జినవిజయం” జైన మత ప్రచారం కోసం, శంకరుల కాలం తర్వాత వ్రాయబడిన గ్రంథం. తమ జైన మత ప్రచారం కోసం, క్రీస్తుపూర్వం శంకరులు ఉన్నట్లు ఆ గ్రంథంలో వ్రాసారేగాని, అది ప్రామాణిక గ్రంథం కాదు.

అంతేకాదు, మళయాళభాషకు ఎనలేని సేవచేసిన శంకరకురుప్, తగళి శివశంకరపిళ్ళే, వేలాయుధన్ వంటి రచయిత, అంజం మాధవన్ నంబూద్రి, శెంగలిపురం అనంతరామ దీక్షితార్ వంటి పౌరాణిక సార్వభౌములు, చెంబైవైద్యనాథ్ భాగవతార్ వంటి సాహితీ పరిమళంగల సంగీత విద్వాంసులు కూడ శంకరులు క్రీస్తుశకం 788-820 నాటి వారేనని నొక్కి వక్కాణించారు. ఇంత వరకూ గ్రంథాల ఆధారంగా చర్చించాను. అయితే కేవలం పండితాభిప్రాయాలను; గ్రంథాలను

చరిత్ర పరిశోధకులు అంగీకరించారు. అందుకని చారిత్రకాధారాలతో శంకరుల కాలాన్ని నిరూపిస్తాను.

1993లో నేను ఒక కంబోడియా శాసనాన్ని పరిశీలించాను. ఆ శాసనంలో "శివసోముడు" అనే వ్యక్తిని శంకరాచార్యుల సమకాలికుడుగా పేర్కొనడం జరిగింది. ఎవరీ శివసోముడు? క్రీస్తుశకం 820-840 మధ్య పాలించిన ఇంద్రవర్మ మహారాజుకు గురువు. శంకరాచార్యుల శిష్యుడైన ఈ శివసోముడు క్రీ.శ 820 లో శంకరులు హిమాలయాలలో సిద్ధి పొందిన తర్వాత, ఇంద్రవర్మ మహారాజుకు (820-840) గురువుగా ఉన్నట్లు తెలుస్తోంది.

ఒక్కసారి చరిత్రలోకి వెళ్లాం. జైన మతాన్ని మహోన్నత స్థితికి గొనిపోయిన వర్ధమాన మహావీరుడు క్రీస్తుపూర్వం 540లో జన్మించి 508లో నిర్యాణం చెందాడు. (క్రీస్తుపూర్వం సంవత్సరాలు వెనుకకు లెక్కించాలి. అంటే క్రీస్తు దగ్గరకు వస్తున్నాం గనుక). శంకరాచార్యుల వారు క్రీస్తుపూర్వం 508లో జన్మించి ఉంటే, వర్ధమానుడు అస్తమించిన ఏడు ఈయన జన్మించి ఉండాలి. శంకరులు వ్రేళ్ళు పాతుకుపోయిన జైన మతాన్ని ఖండించారు గాని, ఉదయించే జైన మతాన్ని కాదు ఆయన ఖండించింది !

ఇక గౌతమ బుద్ధుని కాలం క్రీస్తుపూర్వం 567 -486 (80 సంవత్సరాలు జీవించాడు). శంకరుని జన్మ క్రీస్తుపూర్వం 508 అయితే, బుద్ధుడు జీవించి ఉండగానే శంకరాచార్యులు పుట్టి ఉండాలి. బుద్ధ నిర్యాణం నాటికి (క్రీ.పూ 486) శంకరాచార్యుల వారికి 22 ఏళ్ళు అయి ఉండాలి. శంకరులు అప్పుడు ఉండి వుంటే బుద్ధుడిని కలుసుకొని, ఆయననే వాదంలో జయించకపోయారా? శంకరుడు ఖండించింది దేశంలో బాగా (శతాబ్దాల తరబడి) జీర్ణించుకుపోయిన బౌద్ధమతాన్ని కదా !

చివరి ఆధారం. అశోక చక్రవర్తి కళింగ యుద్ధం చేసింది క్రీస్తుపూర్వం 261లో. అప్పటికి 215 సంవత్సరాల ముందే శంకరాచార్యుల వారు నిర్యాణం చెంది ఉండాలి. ఇదే నిజమైతే అశోకుడు బౌద్ధమతాన్ని ఎందుకు స్వీకరిస్తాడు? శంకరుల అద్వైతాన్నే స్వీకరించేవాడు? (శంకరాచార్యుల అవతరణతో బౌద్ధమతం విదేశాలకు పారిపోయిందిగదా! కనుక శంకరులు క్రీస్తు పూర్వం వారనే వాదన తప్పని తేలిపోయింది.

శ్రీవారు క్రీస్తుశకం 788లో వైశాఖ శుద్ధ పంచమినాడు జన్మించి, క్రీ.శ. 820లో నిర్యాణం చెందారని స్పష్టంగా తేలిపోయింది. (తర్వాత 200 ఏళ్ళకు రామానుజులు (క్రీ.శ 1017-1137) జన్మించారు. ఆ తర్వాత క్రీ.శ. 1198 - 1279 మధ్వాచార్యుల కాలం).

ఇక శంకరుల జన్మస్థలం కాలడి. ఈ విషయంలో భేదాభిప్రాయం లేనే లేదు. శ్రీ శంకరాచార్యుని పూర్వీకులైన నంబూద్రి బ్రాహ్మణులు వేదకాలం నుంచీ ప్రత్యేకత సంతరించుకొన్న శాఖీయులు. వారు పూర్వం నర్మదానదీ ప్రాంతం నుంచి వచ్చి చేర రాజ్యం (కేరళ)లో స్థిరపడ్డారని మొన్నటి వరకు చెప్పుకొనేవారు. కానీ వారు ఆంధ్రులని, తెలుగుదేశం నుంచి కేరళ వచ్చి స్థిర పడ్డారని ఇప్పుడు అందరూ అంగీకరిస్తున్నారు. శంకరాచార్యుడు తెలుగువాడు కావటం నిజంగా మన అదృష్టం. "ఆర్యాంబ తెలుగువారి ఆడబడుచు" అనే విషయం పండితులు కేరళలో ఎప్పుడో తేల్చి వేసారు. 1991 నుంచి సాగిన నా కాలడి పరిశోధనలో చివరిగా 1995 జూన్ 20, 21 తేదీలలో పరమ పవిత్రము, హిందూ మతానికే క్లైమాక్స్ (పతాకస్థాయి) అనదగ్గ గురువాయూర్ శ్రీ కృష్ణాలయంలోని ప్రధాన తంత్రి (పూజారి) శ్రీ శశినంబూద్రి నాతో ఈ విషయమై ముచ్చటించారు. "ఎప్పుడో లక్షల సంవత్సరాలనాడు మా నంబూద్రులు ఉత్తర హిందూ స్థానం నుంచి వచ్చారేమో తెలియదు. కానీ వీరు దాక్షిణాత్యులే - అంటే ద్రావిడులే. ఆంధ్రదేశంలోని గుంటూరుకు 6మైళ్ళ దూరంలో (గుంటూరు -విజయవాడరూట్‌లో) నంబూరు గ్రామం నుంచి వీరిని కలియుగం ప్రారంభమైన కొంత కాలానికి పరశురాముడు మా కేరళకు తీసుకొచ్చాడు. సంస్కృత భాషను ఉచ్చరించటంలో తెలుగువారికి సాటి మరెవరూ లేరు. (ఉదా : వేంకటేశ్వర సుప్రభాతం తిరుమల క్షేత్రంలో ఎంత స్పష్టంగా చదువుతారో చూడండి. ఉత్తరాది సంస్కృత ఉచ్చారణ హిందీలానే ఉంటుంది).

అందుకే త్రేతాయుగం నుంచి చిరంజీవిగా ఉన్న పరశు రాముడు తన పరశురామ క్షేత్రానికి (కేరళ) స్వచ్ఛమైన పూజారులు అవసరమై, ఆంధ్రలోని నంబూరు నుంచి బ్రహ్మణులను కేరళకు తెచ్చారు. వారే మా నంబూద్రి బ్రాహ్మణులు. మాకు మీ తెలుగు రాక పోవచ్చు. కానీ మా పూర్వీకులు మీ ఆంధ్రులే అని వివరించారు గురువాయూర్ దేవస్వ (దేవాలయ) ప్రధానతంత్రి శ్రీ శశినంబూద్రి. ఆయన సంస్కృతంలో మాట్లాడారు. త్రిచూర్ వడక్కునాథ దేవాలయంలోని

శాసనంలోనూ నంబూరు పేరు ఉంది. కనుక శంకరుని పూర్వీకులు నంబూరు నుంచి వెళ్ళినవారేనని, మన ఆంధ్రులని తేలిపోయింది. (ఇక కేరళను పరశురామ క్షేత్రమని ఎందుకంటారంటే, ఆనాడు పరశురాముడు క్షత్రియుల నందరినీ నశిం‍చి, భూమిని సముద్రంలో ముంచి, తన తల్లి రేణుకాదేవి వంశమని దయదలచి, తన నాగలితో సముద్రం నుంచి ఒక ముక్కను బయట పడవేసాడని, అదే పరశురామక్షేత్రమైన కేరళ అని మలయాళీల నమ్మకం).

'కాలడి గ్రామం కేరళలో మొదటి నుంచీ ప్రకృతి సంపదతో చూడ ముచ్చటగానే ఉండేది. శంకరాచార్యుల కాలానికి.- అంటే క్రీస్తు శకం 788 నాటికి చేర దేశాన్ని ( కేరళ) పెరుమాళ్ రాజులలో చివరి వాడైన శంకర రవివర్మ పాలిస్తున్నాడు. ఆయన కాలడిని బ్రాహ్మణాగ్రహారంగా ఎంతో అభివృద్ధి చేసాడు. దాన్ని వైదిక గ్రామంగా తీర్చి దిద్దాడు. మహా పండితుడైన విద్యాధిరాజు కుమారుడు శివగురువు, మేల్పలూర్ నామాకు చెందిన ఆర్యాంబను (తెలుగువారి ఆడపడుచే, అక్కడ స్థిరపడ్డారు) వివాహం చేసుకొన్నారు. వారికి ఎంతకాలానికీ సంతానం కలుగలేదు. ఒక శివరాత్రినాడు ఆ దంపతులు వృషాచలేశ్వరం (శివ తురుపేరూర్ - నేటి మహాపట్టణం త్రిచూర్) లోని వడక్కునాథాలయంలో ఉపవసింపగా, రాత్రి పరమేశ్వరుడు శివగురువు కలలో కన్పించి, తానే వారికి కుమారుడుగా పుడతానన్నాడు. తర్వాత ఆర్యాంబ గర్భవతియై శంకరునికి జన్మనిచ్చింది. శంకరుడు మూడేళ్ళ వాడై యుండగానే తండ్రి శివగురువు అస్తమించాడు.

ఆర్యాంబ శంకరునికి 5వ ఏడు రాగానే శాస్త్రీయంగా ఉపనయనం చేసి, గురువుల వద్దకు పంపింది. అతడు 9 ఏళ్ళకల్లా సకల శాస్త్రాలు అభ్యసించాడు. అసలు 5వ ఏటనే ఆయన నోటివెంట 'కనకధారాస్తోత్రం' వెలువడింది. అది ఎలాగంటే.

ఆనాడు 'కాలడి' చిన్న బ్రాహ్మణాగ్రహారం. అందుచే అతడు ఇరుగు - పొరుగు గ్రామాలకు భిక్షకు వెళ్ళేవాడు. అలా కాలడికి 24 కిలోమీటర్ల దూరంలో ఉన్న "పలంబోడ్డం" (Fruit Garden) అనే ఊరికి 5వ ఏట భిక్షకు వెళ్ళగా, ఓ బ్రాహ్మణస్త్రీ నిరుపేదయైనందున, ఇంట్లో ఏమీలేక ఒక ఉసిరికాయ భిక్షాపాత్రలో వేసింది. శంకరులు ఆమె స్థితికి జాలిపడి లక్ష్మీదేవిని ప్రార్థిస్తూ 'కనకధారాస్తోత్రం' చెప్పగానే లక్ష్మీదేవి క్షణకాలం పాటు ఆ ఇంటిపై బంగారు ఉసిరికాయలు కురిపించింది. అదే

నేటి బంగారు భవనం "స్వర్ణత్తుమన" బంగారు ఉసిరికాయ నేటికీ అక్కడ ఉంది (దీన్ని గూర్చి చివరకు చెబుతాను).ఏమైనా 5వ ఏటనే శంకరాచార్యులు సాధించిన తొలి ఘన కార్యం దారిద్ర్య నిర్మూలన అని మనం గ్రహించాలి.

9వ ఏడు రాగానే ఆయన సన్యసిస్తానన్నాడు. తల్లి ఆర్యాంబ ఒప్పుకోలేదు. నిజమైన సత్యపరితపన ఉంటే, పరమాత్మ సముద్ధరించి తీరుతాడు. ఒకనాడు పూర్ణానది (పెరియార్)లో స్నానం చేస్తుంటే మొసలి ఆయన కాలును పట్టు కొంది. గ్రామమంతా మూగింది. "అమ్మా ఈ మొసలి కన్న సంసారమనే మొసలి భయంకరమైనది. నాకు సన్యాసానికి అనుజ్ఞ ఇవ్వు" అన్నాడు శంకరుడు. కుమారుడు బ్రతికుంటే చాలని ఆమె అనుజ్ఞ ఇచ్చింది. వెంటనే మొసలి అతని కాలును వదిలింది. తల్లిని మేనమామలకు ఒప్పగించి "నీ అంత్యకాలంలో తప్పక నీవద్ద ఉంటాను" అని ఆమెకు చెప్పి, సన్యాసియై 9వ ఏట శంకరుడు కాలడి వదలి వచ్చేసాడు.

కాలడి దాటి మహారణ్యా గిరిదుర్గాలు పరిభ్రమిస్తూ శంకరుడు సద్గురువుకోసం అన్వేషించసాగాడు. ఆయన అన్వేషణ ఫలించింది.

నర్మదానదీ తీరంలో ఒక గుహలో నివసిస్తున్న శ్రీ గోవింద పాదులను ఆశ్రయించాడు శంకరుడు. పొంగి పొర్లే నర్మదానదిని ఓనాడు తన కమండలంలో బంధించాడు. "నర్మదానదీ జలాన్ని కమండలంలో బంధించగల వాడే బ్రహ్మసూత్రాలకు భాష్యం వ్రాయగలడు" అని వ్యాసమహర్షి చెప్పిన విషయం గోవింద పాదులకు వెంటనే జ్ఞాపకం వచ్చింది. "బ్రహ్మసూత్రా"లకు భాష్యం వ్రాయమని శంకరుని ఆజ్ఞాపించాడు.

గోవిందపాదుల మహా మౌనముద్ర గర్భంనుంచి బయలు దేరిన శంకరుడనే బడబాగ్నిజ్వాల అజ్ఞాన తమస్సుపై రణభేరి మ్రోగించింది. ఈశ్వరుడు ఛండాలుని రూపంలో కనుపించి, శంకరులు "మనీషా పంచకం" చెప్పగానే అనుగ్రహించాడు.

"డు కృ ఞ్ కరణే" అని వ్యాకరణం వల్లిస్తున్న ఓ మూర్ఖ బ్రాహ్మణుని, అంత్య కాలంలో వ్యాకరణం రక్షించిందని, గోవిందుని భజించమని చెప్తూ "భజగోవింద' శ్లోకాలు చెప్పారు శంకరులు.

(సశేషం)



కాలడిలోని శృంగేరి శారదా మఠం



కాలడి వద్ద పూర్ణానది (పెరియార్)

# శ్రీ మద్రామాయణ వైభవం

*- అక్కిరాజు రమాపతిరావు*

మొదటి విషయం, రామాయణానికి తెలుగు వారి సాంస్కృతిక జీవితంలో చాలా గొప్పస్థానంవుంది. తెలుగు వాళ్ళకూ రామాయణానికీ ఏదో గొప్ప తాదాత్మ్యం ముడిపడి పోయింది. తరతరాలుగా ఇది సాగుతూనేవుంది. ఆ సేతుహిమాచలం నవీన భారతీయభాషలన్నిటా ఆ సాహిత్యాలన్నీ పరిశీలించి చూస్తే, రామాయణం ఇతి వృత్తంగా తెలుగులో వచ్చిన గ్రంథాలుమరి ఏ ఇతర భాషా సాహిత్యాలలో ప్రభవించ లేదేమోననిపిస్తుంది. తెలుగులో కావ్య ప్రక్రియలలోకాని నవీన వచన సాహిత్య ప్రక్రియలలో కాని, రామాయణం గ్రథితం కాని ప్రక్రియ అంటూలేదు. పద్యకావ్యం, ప్రబంధం, నిర్వచనకావ్యం, అచ్చతెలుగు, నిరోష్ఠ్యం ఇలా మొదలు కొని నవల, కథా, ఖండ కావ్యం, గేయరూపకం, ఏకాంకిల వరకు రామగాథను ఆయా రచయితలు స్వీకరించే ఉన్నారు.

తెలుగు దేశంలో రామమందిరంగాని, ఆంజనేయుడి గుడి కాని లేని పల్లె ఉండనే వుండదు. ఇక నిన్నటి మొన్నటి వరకు రామభజనలు, సప్తాహాలు అమితమైన ఉత్సాహంతో జరుగు తూనేవుండేవి. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి స్వాతంత్ర్య సత్యాగ్రహసేనకు 'రామదండు' అనిపేరు. ఈ పదివందల సంవత్సరాల తెలుగు సాహిత్య చరిత్రలో సుమారుగా రామాయాణ సంబంధమైన రచనలు పదివేలైనా వచ్చి వుంటాయని నా అంచనా. దండకాలు, కీర్తనలు, గోవిందనామాలు, కోలాటపుపాటలు, ఆఖరుకు మాలపల్లిలో తక్కెళ్ళ జగ్గడి సామాజిక విప్లవాన్ని ప్రచారం చేసే కీర్తనల కూడా వంతపాట అంటారా.- పల్లవి అంటారా- అది రాముణ్ణి వుద్దేశించే - 'రామారామా శ్రీరామా రఘురామా- ఆదికాలమున అందరూ జనులూ అన్నదమ్ములండీ" - అని. పెళ్ళిపాటలు, లాలిపాటలు, జోలపాటలు, తలుపుదగ్గరపాటలు,పవ్వళింపుసేవలు, బిచ్చగాళ్ళపాటలు ఇవన్నీ సరేసరి. అసలు మన ఆది కవీంద్రులైన నన్నయభట్టుగారు కూడా రాఘవాభ్యుదయం అనేకావ్యం రాసినట్లుగా కొందరి పరిశోధక సాహిత్య చరిత్రకారుల అభిమతం. తిక్కన సోమయాజిగారు నిర్వచనోత్తర రామాయణం రచించారు. ఎర్రాప్రెగ్గడ గారి రామాయణం మన దురదృష్టంవల్ల మనకు లభించలేదుగాని, ఆ

తరవాత కవులంతా రామకథను గానం చేస్తునేవచ్చారు. అసలు భారతీయ సంస్కృతిలోనే రామాయణ గాథకొక విశిష్టమైన స్థానమున్నది. కన్నడులకూ, మనకూ కూడా జ్ఞానపీఠపురస్కారం రామాయణ రచనకే లభించింది. జగత్ప్రసిద్ధమైన తులసీదాస రామాయణాన్ని గూర్చి చెప్పవలసిన పనేలేదు కదా భాస్కరాదులు, రంగనాథుడు పరమపూజ్యమొల్ల, కంకంటి పాపరాజు, కళువెవీరరాజ, కట్టావరదరాజు, ఇలా చెప్పుకుంటూ పోవాలే కాని పరమ ప్రసిద్ధులైన రామాయణ రచయితలు మూడువందల మందికి మించుతారని పూజ్యులు శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి అంచనా. ఇక నవీన కాలంలో గోపీనాథం వెంకటకవి, వావిలికొలను సుబ్బారావుగారనే వాసుదాసు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, జనమంచి శేషాద్రిశర్మగారి వంటి జగజట్టీ లెందరో వున్నారు. శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యుల వారి జనప్రియరామాయణం పాడుకోవడానికి అనువుగా రూపొందింది. గడియారంవారి రామాయణం వచ్చింది. వేంకట పార్వతీశ్వరకవులు రామాయాణం రచించారు. విశ్వనాథవారి రామాయణ కల్పవృక్ష వైశిష్ట్యం మనం విన్నదే. 'వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితిననిపించుకో వృథాయాసములైన కట్టుకథ లైహికమాపరమా అన్నారుట'- వాళ్ళ నాన్నగారు శోభనాద్రిగారు. ఇక యక్షగానాలకు, వేదాంతకీర్తనలకు, కందార్థాలకు మనకు కొదవే లేదు. మోక్షగుండరామాయణం (తాళ్ళూరినారాయణకవి) ఆధ్యాత్మరామాయణం (మునిపల్లె సుబ్రహ్మణ్య కవి) తెలుగు దేశంలో చాలప్రచారం పొందాయి. అత్యంతాధునికులూ ఆకృష్టులైనారు. కీర్తిశేషులు తిలక్‌మంచి పద్యాలు రాశాడు సీతమ్మ తల్లిపైని. కరుణశ్రీఖండ కావ్యాలు ప్రసిద్ధాలేకదా. అతిరథులు మహారథులు వచన సుధనందించారు తెలుగు పాఠకులకు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ నివాసశిరోమణి వంటి స్వర్గతులు, అప్పలస్వామిగారి వంటి ఆధునిక కవిపండి తులున్నూ రామాయణాన్ని తెలుగు వారికి వచనంలో ఆమ్నాయంగా అందించారు.

పంచవటి, పర్ణశాల, ఋశ్యమూకం, పంపాసరస్సు, దండకారణ్యాం, ఇవన్ని తెలుగు వారివే అని ఎక్కడ లేని ఆనందంతో మనంపరవశిస్తాం. సీతమ్మవారు చీర ఆరవేసుకోని చోటూ రాముల వారు పర్ణశాల కట్టని ప్రదేశమూ మన తెలుగు దేశంలో కనపడవని హాస్యం చేశాడు- ఆయన్ను ఆధునిక వాల్మీకి అని అంటున్నారు కూడా- గురజాడ వాల్మీకి-అని ఇంద్రగంటి. చాలా గొప్పపరిశోధక విద్వాంసులు పరమపదవాసి టేకుమళ్ళ రాజగోపాలరావు, రాముడు తెలుగువాళ్ళ దౌహిత్రుడు అని అత్యంతాభినివేశంతో ప్రతిపాదించారు. మంగళం కోసలేంద్రాయ, దాసోహంకోస లేంద్రస్య' -

అనిరాముణ్ణి గూర్చి ప్రస్తావించడం ఆయన కోసల దేశానికి ప్రభువు కాదా - అందువల్ల వాళ్ళ అమ్మగారు తెలుగు వాళ్ళు స్థాపించి పరిపాలించి నిర్మించిన మహాంధ్రసామ్రాజ్యంలోని దక్షిణ కోసలరాజన్యుల ఇంటి ఆడబడుచు అని రాజగోపాలరావుగారంటారు. విశ్వామిత్రుని సంతతి వారు ఆంధ్రులని ఐతరేయం. తెలుగు వాళ్లలో ఆంధ్రులది ఒక శాఖ. ఏమైనా తెలుగు వాళ్ళకి రాముడు ఇష్ట దైవం ఇలవేల్పు, నుడి కారం. రామ బాణం, రామ రాజ్యం, శ్రీరామరక్ష, వాడొట్టి అగస్త్యభ్రాత, సీతమ్మ వారి కష్టాలు, వాడా, వాడా రావణాసురుడు ఇలాగా రాముడు తెలుగు వాళ్ళ నుడికారమై పోయినాడు. త్యాగరాజుల ...య రామభక్తి సామ్రాజ్యాన్ని తెలుగు వాళ్ళ హృదయక్షేత్రాలలో విస్తరింపజేశారు. 'ఉండేది రాముడొకడు, రామ నన్నుబ్రోవరా, అలకలల్లలాడ, సీతాపతే, వెడలెను కోదండపాణి, కాలహరణ మేలరామ' సంగీత ప్రియులరసనాగ్రలపై నర్తించేకృతులే ఇవన్నీ వాళ్ళంతా సుకృతులు. ప్రయాగరంగదాసు, తూమురానదాసు, అందరికన్నా ముందు చెప్పవలసిన భద్రాద్రిరామదాసు, తెలుగు దేశాన్నంతా రామమయంచేశారు-ఇదీ తెలుగు వాళ్ళకి రాముడికి వుండే మమేకత్వంతో కూడిన సంబంధం.

ఇక శ్రీమద్రామాయణం ఆది కావ్యం-తరతరాలుగా వేలవేల సంవత్సరాలుగా రామాయణానికి ఈ ప్రశస్తి ఎందుకు వచ్చింది? భారతీయుల హృదయాలలో ఇంతగా ఎందుకు తిష్ఠవేసు కొని కూర్చుంది అంటే ఒక సూక్ష్మ సూక్ష్మమైన పరమార్థాన్ని గ్రహించవలసి వుంది. సంస్కృతంలో ఒక శ్లోకంవుంది. భాగవతం అర్థంకావాలంటే భక్తి, భారతం అర్థం చేసుకోవాలంటే భక్తి, యుక్తి, రామాయణానికి భక్తి, యుక్తి, శక్తి కూడా కావాలని. అంత మహోత్కృష్ట గ్రంథమా-అవును, భగవద్గీతలో శ్రీకృష్ణుడు- 'పవనః పవతామస్మి, రామశ్శస్త్రభృతామహం-' అని శస్త్రధారులందరిలో నేను రాముణ్ణి అని చెప్పు కొన్నాడు. శస్త్రధారి అంటే శాస్త-శాసించేవాడు. మలయాళీలు అయ్యప్పను శాస్త అంటారు. ధర్మరక్షకుడు, ధర్మశాసకుడు అన్నమాట. అవతారాలన్నిటా రామావతారానికి ఏమిటి ఈప్రశస్తి! భారతీయ జీవనపరమార్థం దాంపత్యధర్మం. అదే సర్వసృష్టికిమూలం. ప్రకృతీ పురుషుడు- పరమాత్మా, జీవాత్మా. అన్నిటికీ మూలకందమైన, మూలకేంద్రమైన పరమధర్మం ఈ దాంపత్య ధర్మం. ఈ దాంపత్య ధర్మానికి విఘాతంకలిగించకూడదు. అటువంటి ప్రయత్నం ఎక్కడా జరగ కూడదు. దాన్ని భారతీయ తత్త్వచింతనం సహించదు-అని రామాయణం చెపుతున్నది. రావణుడు లోకకంటకుడుగా ప్రజల నోళ్ళలో నానిపోవడానికి కారణం ఇదే-అసలు రామాయణ బీజాగాథా శ్లోకంలోనే.

ఈభావం నిక్షిప్తమైవున్నది 'మానిషాదప్రతిష్ఠాంత్వమగమ శ్శాశ్వతీస్సమాః యత్క్రౌంచ మిధునాదేక మవధీం కామమోహితః-' మిధునః అంటే పరస్పరం- అని అయుర్వేద గ్రంధంలో చదివాను.దాంపత్యధర్మానికి భంగంచేయదలచుకున్న రావణుడునాశనమైనాడు. శూర్పణఖవృత్తాంతందీన్నే బోధిస్తున్నది. వాలివధలోని అంతరార్థం కూడా ఇదే-బలవంతంగా తమ్ముడి భార్యని వశంచేసుకున్నాడు వాలి.అహల్యకు కూడా తప్పు లేదు ఈ శిక్ష. ఆమె అంత మహానుభావురాలై వున్నప్పటికీ కూడా. పరశురాముడు వివాహదీక్షా తోరణాన్ని చూపితే ఆ రాజును చంపకుండా విడిచి పెట్టేవాడుట. విశ్వనాథ వేయిపడగలలో అన్నీ పోయినా సుబ్రహ్మణ్యా స్వామి రెండు పడగలు మాత్రం మిగిలి కనపడతాయి. పవిత్రమైన దాంపత్యధర్మానికి ఇది సంకేతం. 'నీవుమిగిలితివి. ఇది నశించదు. ఇది నా జాతి చైతన్యం. ఇది నా జాతి సంపద. ఇది పోదు. ఇది శాశ్వతంగా నిలిచివుంటుంది-' అనుకొంటాడు ధర్మరావు. అదుగో అటువంటి దాంపత్యధర్మాన్ని పరిరక్షించాడు రాముడు. అందువల్ల రామాయణం ప్రీతి పాత్రం నాటికీ నేటికీ ఏనాటికీ కూడా భారతీయులకు. రావణుడు నిజానికి ఇతర అవతారాలలో కనపడేదుష్ట శక్తులవంటి వాడుకాదు. అయినాదాంపత్య ధర్మానికి ఎగ్గుతలపెట్టాడు. అందువల్ల అతణ్ణి లోకులు అంతగా ద్వేషిస్తున్నారు. అనుకూలమైన,- ఒకే మనసు, రెండుతనువులైనా- అనేంతగాభాసించే దాంపత్యంకన్నా మోక్షంలేదు. పరమార్థంలేదు అని ప్రతి పాదించడమే భారతీయ వ్యవస్థలో దీనికి కామాన్ని జతచేసి చెప్పడం. ధర్మర్థకామ మోక్షాలు. ఇహలోకంలో కామమే మోక్షం. పరంలో కోరుకోదగ్గది ఏదైనావుంటే అది మోక్షం అని దీని అర్థం. కామః కామ ప్రదః ప్రభుః అని విష్ణు సహస్ర నామం. 'ధర్మాఽవిరుద్ధో భూతేషు కామస్మి భరతర్షభ-' అని గీత. అంతే కాని భారతీయులు ఇహాన్ని తక్కువచూపు చూశారనడం సబబుకాదు. ప్రకృతి వినాపురుషుడు జడుడు అని వేదాంతం, తత్త్వంబోధిస్తున్నాయి. దాంపత్యం ధర్మాఽ విరుద్ధంగాసాగాలి. అప్పుడే సృష్టికి ప్రవృత్తి. లేక పోతే సృష్టి లేదు. గీతలో భగవంతుడు చెప్పిన 'ద్వంద్వస్సామాసికశ్చ' అనడంలో కూడా అద్వంద్వం-భార్య భర్తలే - దాంపత్యవ్యవస్థే - అని చిదచిత్తులు, సదసత్తులు - అవి వేదాంతపరిభాష- అంతకన్నా ఈ సృష్టిలో దాంపత్య ధర్మ పరిపాలకుణ్ణి. శాస్త్రను నేను-అంటున్నాడు ప్రభువు-అనుకుంటే మనకు బాగా అర్థమవుతుంది. ఇది లోకానికి రామాయణం ఇంతగా ప్రీతి పాత్రంకావడానికి కారణం.

*(సశేషం)*

# శ్రీ విశ్వనాథశతజయంతి
# (1895 - 1976)

(ఈ శతాబ్ది కవులలో నవలా రచయితలలో పండితులలో సాహితీ వేత్తలలో విశ్వనాథ సత్యనారాయణ అగ్రగణ్యులు. ఆయన శతాధిక గ్రంథకర్త. అరవై నవలలు ఒకే చేతి మీదుగా వ్రాసిన (చెప్పిన) మహారచయిత. ప్రాచీన మహాకవులకు దీటుగా ఆయన శ్రీమద్రామాయణకల్పవృక్షాన్ని రచించారు. ఈసెప్టెంబరు 3వ తేదిన వారి శతజయంతి. ఈమహాకవిని గూర్చి శ్రీమద్రామాయణకల్ప వృక్షంలోని శివధనుర్భంగ ఘట్టం సన్నివేశంలోని ఒక పద్యం ప్రచురిస్తూ 'విశాఖ' అనే గొప్పభావుకులు, కంచి పరమాచార్యులైన శ్రీచంద్ర శేఖరేంద్ర స్వామివారి పరమ భక్తులు, వ్రాసిన వ్యాఖ్యాను ఉదాహరిస్తూ విశ్వప్రకాశం' శ్రీవిశ్వనాథశతజయంతి నివాళిసమర్పిస్తున్నది|| సం.)

"మంజూషలో నె యమర్చికోణంబందు
నొక్కత్రాటంగొప్పునెక్కువెట్టి
గాబోలు మంజూషికావినిర్గమనంబు
వేళకే జ్యావల్లి బిగిసియుండె-
దాళప్రమాణమౌ ధనువు జానకిదృష్టి
కడ్డమ్ముగా వచ్చునంచునెంచె
గాబోలు, నడ్డంబుగాధనుస్సునుబూని
పిడిబాకువలె ద్రాడువ్రీలలాగె
అతని దృష్టికి జానకి యాగ లేదు
అతని దృష్టికి శివధనుస్సాగలేదు
సీతపూజడ వెన్నుగా శిరసువంచె
జెఱకుగడవోలె నడిమికి విరిగెధనువు."

ధనుర్భంగమునకై రాముడు సభాప్రవేశం చేస్తాడు. తలెత్తి చూస్తే సీత కనపడింది. ఆసీత ఎట్లున్నది?

ఆమె తెలియని కోరిక వలెవుందట. జన్మాంతరసంబంధం ఒకహద్దుకు వస్తే ఎట్లావుంటుంది? తనప్రాణాలే బయలుకువచ్చి ఒక మోహనస్త్రీ రూపందాల్చితే ఎట్లా వుంటుంది? హృదయంలోని ఆనందము, ఉత్తమ భావాలు, రూపెత్తి నిలిస్తే ఎట్లావుంటుంది? అరుంధతి, అహల్య, కౌసల్యవీరి ముఖములలోని పవిత్రత

శృంగారభావమనే సరస్సులో మజ్జనంచేస్తే ఎట్లా ఉంటుంది? సీత అట్లాఉంది.

రాముని చూపు జానకి అనే నారిపై, శివధనస్సు యొక్కనారిపై ఒక్క మారు వాలింది. విల్లు ఎత్తడం, వింటిని విరచడం, విరిగిన శబ్దం విన్నంత వరకు రాముడెరుగడు. సీత శక్తిచాలనం అటు వంటిది. శ్రీరాముల వారిదృష్టి సీత భరించ లేక సిగ్గుతో శిరస్సు వంచింది. ధనుస్సు ఆయనకృషికి (ఎక్కుపెట్టటానికి) సహించలేక బద్దలైంది.

శివధనుర్భంగంలో కలిగిన మహారవాన్ని కవి వర్ణిస్తాడు ఇలాగా, కైలాసంలో ఉన్న గణపతి కర్ణకుహరాలలో అదిహ్రీంకారమైనదట. హ్రీంకారం భువనేశ్వరీ బీజం. 'శక్తిస్తు భువనేశ్వరీ! మిథిలలో భువనమోహనుడు భువనేశ్వరీ నిమిత్తంగా విల్లులాగటం, ఆవిల్లు విరగటం, ఆశబ్దం హ్రీంకారంగా, అందరికీ పెళ్ళిచేసిపెడుతూ, తాను బ్రహ్మచారిగా వుంటూ, అన్నిటికీ ప్రథముడైన గణపతి చెవులలో పడటం - ఎంత చక్కగా వుంది?

అంతేకాదు. ఆరుముగములూ పంద్రెండు కళ్ళుకల కార్తికేయుని ద్వాదశనేత్రములూ ఆశబ్దమునకు విప్పారినవట! శివుని అర్ధదేహం అపహరించి, ఆనందంలోవున్న మంచుకొండ ఆడబిడ్డకు బొమముడి పాటు కైలాసంలో ఆహ్రీంకారం కలిగించిందట. ఆశబ్దం శైవలోకం, స్వర్గలోకం, దైత్యలోకం, రాజలోకం - అంతటాపర్విన‌ది.

విశ్వనాథ వారి కలంబలం అలాంటిది.
"జయంతి తేసుకృతినోరససిద్ధాఃకవీశ్వరా
నాస్తి తేషాంయశఃకాయే జరా మరణజంభయం."
- మా స్వామి అనే కంచి కామకోటిపీఠపరమాచార్య
శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి సంస్తుతి సంపుటి నుంచి.

*సేకరణ: అక్కిరాజు రమాపతిరావు*

"ఒక మానవజాతిలో నొకదేశములోగల సాంఘిక రాజకీయ మత విషయికాభిప్రాయముల మీద మానవుని శీలము, జాతిశీల మాధారపడియుండును"

*-'సముద్రపు దిబ్బ' నవలలో విశ్వనాథసత్యనారాయణ*

# దివ్యయోగి చరితామృతం-
# ఎల్లారెడ్డిపేట హజ్రత్ ఇమామలీ బాబా
# (1825 - 1934)

*- ఆచార్య శ్రీ బి.రామరాజు*

యోగుల సిద్ధపురుషుల నడవడి, భాషణం, సంచారం, దినచర్య చిత్రంగాను అంతుపట్టనివిగాను ఉంటాయి. సామాన్యులు అటువంటివారిని పట్టించుకోరు. ఆమహాపురుషుల, మాటలో, మాహాత్మ్యమో, కరుణాంతరంగమో అనుభవానికి రావటంతో క్రమంగా జనులు వారిని గుర్తించి ఆశ్రయించి ఇహపరసౌఖ్యాలు పొందుతుంటారు,ఆరాధిస్తుంటారు, అట్టి సత్పురుషులు అన్ని మతాలోను ఉన్నారు.ఎల్లారెడ్డిపేట వాసి హజ్రత్ ఇమామలీ బాబా అట్టి మహిమోపేతులైన యోగుల్లో ఒకరు. ఈ యోగి జన్మస్థలం కరీంనగరం జిలా గంభీరావు పేట గ్రామం. ఆయన కొంతకాలం బడి పంతులుగా ఉద్యోగం చేసినారు; భార్యా కుమారులతో ఉంటూ గృహస్థజీవితం గడిపినారు. కొడుకుపేరు సయ్యద్ నియామతుల్లా. బాబా అన్నగారుకూడ విరాగి. ఇమామలీ బాబా జననకాలం కచ్చితంగా తెలియదు. మరణసంవత్సరం 1934 . ఆనాటికి వారి వయసు దాదాపు 110 సంవత్సరాలు అనటం చేత 1825 ప్రాంతాల్లో ఆయన జన్మించి ఉంటారని ఊహించటం జరిగింది.

1908 మూసి నది వరదలప్పుడు ఇమామలీగారు గంభీరావుపేట చెంత పారే మానేరు గట్టుకున్న ఒక చరియలో తపస్సు చేస్తుండినారు. దాని పేరు నామాపురం గట్టు. మానేరు పొంగి నామాపురం గట్టు కూడ మునిగి పోయింది. యోగ నిష్ఠలో ఉన్న ఇమామలీ గారు చరియలో పూడుకొని పోయినారు. వరదలు తగిన తరువాత ప్రజలు వచ్చి ఇసుకంతా తోడితే యోగనిష్ఠులై ఉన్న ఇమామలీగారు బయట పడ్డారు. అన్ని దినాలు ఇసుకలో పూడి ఉన్నా చెక్కు చెదరని బాబా యోగ మాహాత్మ్యం పరిసర గ్రామాలకు దూరప్రాంతాలకు ప్రాకింది. బాబా గ్రామాల పొలిమేరల్లో అడవుల్లో తిరుగుతూ భక్తులు సమర్పించే సామగ్రితో ఒకతావులో మట్టి పాత్రలో వండుకొని తినేవారు. ఆయన ఎల్లారెడ్డిపేట పొలిమేరల్లోనే ఎక్కువ తిరిగే వారు. ఎలారెడ్డిపేట సిరిసిల్లాకు 12 మైళ్ళదూరం. ఎల్లారెడ్డి పేట గ్రామం పటేలు పాపారెడ్డి భూస్వామి. పాపారెడ్డి బాబాగారి భక్తుడై ఆధ్యాత్మిక సాధన చేసినాడు; ఖురాన్ చదువు కున్నాడు. గురువుగారి కోసం రెండంతస్తుల పెద్ద మేడ కట్టించినాడు. బాబా ఆమేడలో నివాసముంటూ చుట్టున్న అడవిలో తిరిగే వారు. బాబా ఆజానుబాహువు. మితభాషి. ఆయన మాటలందరికీ అర్థమయ్యేవికావు. వారిభక్తులు అధికసంఖ్యాకులు హిందువులే. ఎల్లారెడ్డి పేట

మార్గంగా పోయే సర్వీస్ బస్సులు భక్తుల కోరికపై డ్రైవర్లు బాబా ఆశ్రమం సమీపాన ఆపేవారు.. బాబాను దర్శించివచ్చిన తరువాత బస్సులు సాగి పోయేవి. వేములవాడ జాతర కోసం దూరదూరాలనుండి వచ్చేవారు అక్కడ .కాసేపుండి బాబాను దర్శించిపోయేవారు.

బాబా తెల్లవారింది మొదలు వనసంచారం చేసేవారు. భక్తులు రైతులు తెచ్చియిచ్చే ధాన్యంనుండి మూడు పిడికిళ్ళు తీసికొని రెండు పిడికిళ్ళు మరల వారికే యిచ్చి ఒక్క పిడికెడు తాముంచుకునేవారు. వారు ఈ విధంగా ధాన్యం తీసుకున్న పేదరైతులకు మేలు జరిగేది. తాము తీసుకున్న ధాన్యం అడవిలో చెట్ల క్రింద గుంతల్లో పూడ్చేవారు. తిరిగీ తిరిగీ రెండు జాములప్పుడు ఏదోమోటబావిలోనికి దిగి దీర్ఘస్నానం చేసేవారు. ధరించే గోచి గుడ్డను బాగా ఉతికి మరల దానినే ధరించి నివాసానికి పోయి చుట్టూ పేర్చి ఉన్న కుండల్లో వండుకొని తినేవారు. రేయింబవలు సమీపంలోగాని దూరానగాని జరిగే సంఘటనల వార్తలు చదివేవారు. అవి అందరికీ అర్థమయ్యేవి కావు. ఆర్తులు భక్తులు వస్తే వారు చెప్పకముందే వారి కష్టసుఖాలు చెప్పేవారు. "బాగౌతుంది పో" అంటూ చేతికందిన ఆకో అలమో ఇచ్చి పంపేవారు : ఆశ్రితు లెవ్వరు వచ్చినా ఎన్నిసార్లు వచ్చినా క్రొత్తవారిని అడిగినట్లు "ఎవ్వరు మీరు? ఎక్కడినుండి వచ్చినా" రని ప్రశ్నించేవారు. కడకు తమ కుమారుడు నియామతుల్లా వచ్చినా అట్లాగే ప్రశ్నించేవారు. హజ్రత్ ఇమామలీగారి కీర్తి నానాటికి గ్రామం, తాలుకా జిల్లాదాటి అటు మహారాష్ట్రలో నాగపురం ఇటు బిదరు ప్రాంతాలకు వ్యాపించి ఆ ప్రాంతాల భక్తులు వచ్చి ఎల్లారెడ్డిపేటలో కొన్ని దినాలుండి బాబాను సేవించి పోయేవారు. ఈ విధంగా దాదాపు 110 సంవత్సరాల దీర్ఘకాలం భక్తసులభుడుగా ఆర్తిహరుడుగా బ్రతికి హజ్రత్ ఇమామలీ బాబా 1934 లో తమ దేహం చాలించినారు. అది హిజ్రీ 1353-రబ్బీవులవ్వల్ నెల- 22 తేది, 22 జులై, భావ జ్యేష్ఠబహుళ పంచమి గురువారం, ఆ తేదినాడు ఈనాటికీ వారి సమాధి వద్ద గొప్ప ఉర్సు జరుగుతుంది.

ఇమామలీ గారు దేహం చాలించిన కొలది దినాలకే వారి ప్రముఖశిష్యుడు, భక్తుడు పాపారెడ్డి మరణించినాడు. ఈ గురు శిష్యుల సమాధులు పాపారెడ్డి కట్టించిన భవనంలోనే ఉన్నవి. పాపారెడ్డి చని పోయేనాటికి ఆయన కొడుకులు వెంకటరెడ్డి ప్రభృతులు చిన్నపిల్లలు. అందువలన వారు కట్టించిన బాబా సమాధిమందిరానికి సరియైన రక్షణం కరువైనది. స్వార్థపరులు ఆభవనం కిటికీలు, తలుపులు, రాళ్ళు, కప్పువాసాలు, దూలాలు కూడ పెకలించుకు పోయినారు. బోడి గోడల మధ్య ఉన్న బాబా సమాధినే భక్తులు దర్శించి పోయేవారు. మహాపురుషులకు భవ్యహార్మ్యాలు కటికనేల రెండూ సమానమే గదా ! వెంకటరెడి పెరిగి పెదవాడెన తరువాత

తల్లిగారి ఆదేశంతో బాబా సమాధికి మరల చక్కని ఏర్పాట్లు చేసినాడు. వెంకటరెడ్డికి తోడు సిరిసిల్లావాసి ఆడెపు లింగయ్య అనే భక్తుడు ఈ విషయమై శ్రద్ధతో సేవచేసినాడు. ఈనాటికీ అన్నిమతాల వాళ్ళు ఆ సమాధులను దర్శించి మ్రొక్కులు చెల్లిస్తుంటారు.

హజ్రత్ ఇమామలీ బాబాగారి చరిత్రం వ్రాసిన దామరెడ్డి హనుమంతరావు నాయుడు (హనుమకొండలో సుప్రసిద్ధ డాక్టరు భూషణంగారి తండ్రి) P.W.D. సూపర్వైజర్, కామారెడ్డిపేటలో (1925) తాలూకాఫీసరుగా మొదటి సారి బాబాను దర్శించినాడు. అప్పటికే బాబా వయస్సు 100 ఏండ్లు పైన. అప్పుడు నాయుడుగారు గంభీరావు పేటలో ప్రభుత్వం నిర్మాణాలు పర్యవేక్షిస్తుండినారు. అప్పటికే ఎల్లారెడ్డిపేట పటేలు పాపారెడ్డి పెద్ద భవనం కట్టించి బాబాను అందులో నివాసముంచి పూజిస్తుండినారు. నాయుడుగారు హజ్రత్‌వారి మహిమలు కొన్ని కండ్లారా చూచినారు, మరికొన్ని భక్తులవద్ద సేకరించినారు. ఇమామలీగారికి భక్తులు అప్పుడప్పుడు మేకలు కానుకగా ఇచ్చేవారు. బాబా ఆమేకల మాంసం కొద్దిగా తీసుకొని మిగతా భక్తుల కిచ్చేవారు. తాము తీసుకున్నమాంసంలో చాలాభాగం చెట్ల క్రింద గుంతల్లో పాతి పెట్టి స్వల్పంగా ఉన్నది వండుకొని తాము తింటూ అందునుండి కొంత భక్తులకు ప్రసాదంగా ఇచ్చేవారు. నాయుడు గారికి ఆప్రసాదం వరుసగా మూడు దినాలు లభించింది. నాలవనాడు శనివారం మాంసాహారం తినరు. ఆయన చెప్పకుండానే బాబా ఆయనకు శాకాహారం పెట్టించవలసిందిగా పాపారెడ్డిని ఆదేశించినారు. ఒక దీపావళి పండుగు సమయాన నాయుడుగారు బాబా దర్శనానికి వచ్చినారు. బాబా ఎప్పటివలె వార్తలు చెప్పుతున్నారు. "కుక్కతోకకు పటాకులు కట్టినారు. కుక్కతోకకు పటాకులు కట్టినారు జోడుబార్ల తుపాకి కాల్చినాడు. జోడుబార్ల తుపాకి కాల్చినాడు" అన్నారు. ఎల్లారెడ్డి పేటలో ఒక పోకిరి పి .వాడు కుక్కతోకకు పటాకులు కట్టి వినోదించినాడని తెల్లవారి తెలిసింది. కొన్నిదినాల తరువాత ఒకడు మరొక వ్యక్తిని జోడుబార్ల తుపాకితో కాల్చి చంపినాడని తెలిసింది. నాయుడు కరీంనగరం, జగిత్యాల, సిరిసిల్ల, కామారెడ్డి, ప్రాంతాల్లో ఉద్యోగ విధులు నిర్వహిస్తూ అప్పుడప్పుడు ఎల్లారెడ్డిపేటకు వచ్చి బాబాను సేవించిపోయేవారు. ఆయన హనుమకొండ సమీపంలో పెద్ద మామిడితోట పెంచినారు. ఆతోట మొదటి సారి కాతకు వచ్చినపుడు కొన్ని పండ్లు తెచ్చి బాబాకు సమర్పించినారు. బాబా ఆ పండ్లను ఆశ్రమం స్నానాల గదినుండి ఈ వలికి పారే జాలారు నీళ్ళతో కడిగి ఒక్కొక్క పండు త్రుంచి చాలాభాగం నాలుగు దెసలకు విసరివైచి మిగతా భాగం తాము మూచూచి నాయుడుగారికి ప్రసాదంగా ఇచ్చినారు. తత్ఫలితంగా ఆతోట .బాగా పెరిగి లాభకారి ఐనది. నాయుడు జగిత్యాల తాలూకాఫీసరుగా ఉన్నప్పుడు మున్సిఫ్‌కోర్టు ప్రహరిగోడ నిర్మాణం జరుగుతుండగా మేజిస్ట్రేటు సుతార్లను కోర్టు గుమాస్తాచే కొట్టించి నాయుడుపై

నేరం మోపి అరెస్టు వారంటు వరకు తెచ్చినాడు. నాయుడు పక్షాన వాదించటానికి ఏవకీలూ ముందుకు రాలేదు మిత్రుల ప్రోత్సాహంతో నాయుడు బాబాను ఆశ్రయించి మొరపెట్టుకున్నాడు. బాబా నాయుడు చేతిలో పత్రి పెట్టి 'బాగవుతుంది పో' అన్నారు. నాయుడు కరీంనగరం ప్రయాణమై పోయినాడు. కరీంనగరంలో బస్సు దిగుతుండగా మొయినుద్దీన్ అనే యువక వకీలు ఎదురు వచ్చి "నీ కోసమే ఎదురు చూస్తున్నాను. నాకు వకాలత్‌నామా ఇవ్వు. ప్రతి ఫలం అక్కరలేదు" అన్నాడు. నాయుడు ఇది బాబాగారి మాహాత్మ్యం అనుకొని వకాలత్ నామా ఇచ్చినాడు. వకీలు జిల్లా మెజస్ట్రేటు వద్ద వాదించి వ్యాజ్యం గెలిపించి మున్సిఫ్ మెజిస్ట్రేటును దోషిగా నిరూపించినాడు. బాబా గారి శక్తికి నాయుడబ్బుర పడినాడు. నాయుడు గారు కరీంనగరం లో నివాసముండినపు డొక చమత్కారం జరిగింది. ఇంటి యజమాని ఒకనాడు సత్యనారాయణవ్రతం తలపెట్టినాడు. నాయుడును భోజనానికి ఆహ్వానించినాడు. నాయుడేమో బాబాదర్శనార్థం ఎల్లారెడ్డిపేటకు ప్రయాణమైనాడు, భోజనాల సమయానికి తిరిగి వస్తానన్నాడు. నాయుడు బాబాను దర్శించి తిరిగి పోవలె ననుకున్నాడు కాని పటేలు పాపారెడ్డి నిర్బంధం మూలంగా అపరాహ్ణం దాకా బాబా సన్నిధిలో ఉండి బాబా ప్రసాదం మాంసాహారం తిన్నాడు. ఆయన కరీంనగరం చేరేవరకు సాయంకాలం ఐదు గంటలైనది. ఇంటి వాళ్ళు ఎదురుచూచి చూచి భోజనాలు ముగించినారు. మాంసాహారం తిని దైవదర్శనం కోసం పూజాగృహం ప్రవేశించటానికి వెరచి నాయుడు దూరంనుండే పూజాకలశానికి నమస్కరించినాడు. ఆకలశం కలశంవలె కాక తేజస్వంతమైనముఖం, విశాలనేత్రాలు, మణిఖచితకిరీటం, కంఠాభరణాలతో ప్రకాశించే శ్రీ మన్నారాయణుని దర్శనమైనది. అది నిజమో భ్రమో అని కన్నులు నులుముకొని మరల చూచినాడు. మరల మరల ఆదివ్యమంగళవిగ్రహమే గోచరించటంతో నాయుడు అది బాబా అనుగ్రహఫలం అనుకున్నాడు. సాష్టాంగ పడ్డాడు.

హజ్రత్ ఇమామలీ బాబామహిమలు పొరుగు జిల్లా వరంగల్లు లోను బాగా వ్యాపించినవి. వరంగల్లు కలెక్టరు హంటర్ అనే పాశ్చాత్యుడు తరుచుగా వచ్చి బాబాను దర్శించిపోయేవాడు. బాబా ఖ్యాతి విని రోగులు దుఃఖార్తులు వచ్చి ఆరోగ్యం కోలుకొని సుఖసంతోషాలతో తిరిగి పోయేవారు. వారి అనుమతి లేకుండా పోయినా, వారు వద్దన్నా పోయినా, కష్టాలు కడగండ్లు ఎదురయ్యేవి. బాబా దర్శనానికి వచ్చిన ఒక భక్తుడు అత్యవసరమైన పని ఉండటంచేత బాబా వారించినా తిరుగు ప్రయాణమైపోయి ఒక చోట బస్సునుండి జారిపడ్డాడు. తీవ్రమైన గాయాలతో చాలాకాలం బాధ పడ్డాడు.

ఒకసారి నాగపూరు ప్రాంతవాసి ధనికుడు బహుమూత్రం, కడుపులో మంట, మితి మీరిన ఆకలి వంటి రోగాలతో బాధపడుతూ, కలకత్తా,

బొంబాయి, మద్రాసు నగరాల్లో గొప్ప డాక్టర్లు నయం చేయలేక పోతే బాబా మాహాత్మ్యం విని, మంది మార్బలంతో ఎల్లారెడ్డి పేటకు వచ్చినాడు. ఆసమయాన బాబా భోజనం చేస్తుండటం చేత అతడు కొంత దూరాన చేతులు కట్టుకొని నిలుచుండి చూస్తున్నాడు. అతని ఆర్తి ఎరిగిన బాబా భోజనానంతరం తాము తిన్న చిప్పను ఎంగిలి చేతితోనే కడిగి ఆ నీళ్ళు వ్యాధిగ్రస్తునికిచ్చి తాగు మన్నారు. ఇట్లా వరుసగా మూడు దినాలు ఎంగిలి చిప్పను కడిగిన నీళ్ళు ఆధనికుడు త్రాగి ఆరోగ్యవంతుడై తిరిగి పోయిన్నాడు. ఒక కుష్ఠ రోగి వచ్చి బాబాను ఆశ్రయించి ఆశ్రమం సమీపాన ఒక చెట్టు నీడన పడి ఉన్నాడు. అతని చేతులవ్రేళ్ళు కాళ్ళ వ్రేళ్ళు ఊడి పోయినవి. మూడు నాల్గు మాసాలు బాబా ప్రసాదం తిన్న తరువాత అతనికి క్రొత్తగా వ్రేళ్ళు మొలచినవి. చాలాకాలం అతడు బాబా సేవ చేసి కృతార్థుడైనాడు.

రోగులతో పాటు తీరుతీరు ఆర్తులు వచ్చి బాబాను ఆశ్రయించి వారి అనుగ్రహానికి పాత్రులైన వారున్నారు. కామారెడ్డి రైల్వే స్టేషన్‌లో పనిచేసే వేఇన్స్పెక్టరు కూతురు, పెండ్లిఈడు వచ్చినా సరియైన వరుడు దొరకక తల్లిదండ్రుల పాలిటి గుండెకుంపటిగా మారింది. వరాన్వేషణ చేసి విసిగిన తండ్రి గత్యంతరం లేక బాబాను ఆశ్రయించి తన గోడు చెప్పినాడు. బాబా "నీ కుమార్తె పెండ్లి జరుగును పో" అన్నారు. చుట్టుపట్ల గ్రామాల్లో తగిన వరుడు లేనందున వరునికోసం ఏ ప్రాంతం పోవలెనని ఆ తండ్రి అడిగితే బాబా "నీవు ఎక్కడికీ పోనవసరం లేదు. పెండ్లికొడుకు మీయింటికే వస్తాడు పో" అన్నారు. అన్నట్లే కొన్ని యేండ్లకుపూర్వం సైన్యంలో చేరిపోయిన దగరి బంధువు యువకుడు అనుకోకుండా వారి యింటికి వచ్చి అతని కూతురును పెండ్లాడినాడు. ఆ కాలంలో కామారెడ్డి నాల్గవ తరగతి రైల్వే స్టేషన్. అటువంటి చోట ఒక పేదవాడు బహుకుటుంబి సిగ్నలర్‌గా పని చేస్తుండేవాడు. కొంతకాలం తరువాత నాల్గో తరగతి స్టేషన్లలో సిగ్నలర్ అవసరం లేదనే ఉత్తర్వులు పై అధికారులనుండి వచ్చినవి. దానితో పక్కిరువాని కోతిపై పిడుగుపడినట్లైనది. అతని దుఃఖం చూడలేక స్టేషన్ మాస్టరు వీర వెంకయ్యనాయుడు ఎల్లారెడ్డిపేట బాబాను దర్శించమని సిగ్నలరుకు సలహా యిచ్చినాడు. ఇంతవరకు తాను బాబాను దర్శించని స్టేషన్ మాస్టరు సిగ్నలరుకు ఈ సలహా ఇవ్వటం వింతల్లో వింత. సిగ్నలర్ పోయి బాబా కాళ్ళపైన బడి తన దురతి వినిపించినాడు. బాబా కోపంతో అతణ్ణి అక్కడున్న చెప్పుతోను చీపురుతోను కొట్టినారు. ఐనా సిగ్నలర్ బాబా పాదాలు విడువ లేదు. కాసేపటికి బాబా శాంతించి "బాగౌతుంది పో" అన్నారు. బాబా ముఖ్యశిష్యుడు భక్తుడు ప్రక్కనే ఉన్న పాపారెడ్డి పటేలు "ఇక నమస్కరించి వెళ్ళిపో" అని హితోపదేశం చేసినాడు. సిగ్నలర్ కామారెడ్డికి తిరిగి పోతుండగా త్రోవలో ఒక మిత్రుడు, నీ ఉద్యోగం పోదు.

పై నుండి మరొక కాగితం వచ్చిందన్నాడు. అతడు స్టేషన్ చేరేవరకు క్రొత్త ఉత్వర్వులు వచ్చేదాకా సిగ్నలర్ ఉద్యోగం యథాప్రకారం ఉంటుందని జాబు వచ్చింది. ఆ జాబును అందుకున్న సిగ్నలర్ సంతోషానికి అవధులు లేవు. అతడు కన్నీటితో బాబాకు కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. తరువాత తెలియవచ్చిన విశేషమేమంటే ఈ సిగ్నలర్ బాబాను చూడకుండానే పూర్వం నిందించేవాడట. అందుకే ఆతనికి చెప్పుదెబ్బలు, చీపురు దెబ్బలు. మహాత్ములకోపం స్వల్పకాలికం. కరుణాసముద్రులైన సత్పురుషులు తమనాశ్రయించిన వారందరికీ మేలే చేస్తారు. బాబా బ్రతికున్న నాటివలెనే బాబా సమాధి కూడ ఈనాడు ఆశ్రితులపై నెనరు కురిపిస్తున్నది.

**ఆధారం** : "యెల్లారెడ్డి పేట హజ్రత్ ఇమామలీ బాబాచరిత్రము"
రచయిత : దామరెడ్డి హనుమంత రావు నాయుడు ,
కిషన్‌పురా, హనుమకొండ : 1964

## భక్తి ప్రాశస్త్యము

సీ. శాస్త్రముల్ చదివిన జరువు గాకేమియు
శాస్త్రముల్ చిలుకలు చదువవెట్లు
ధరయెల్ల దిరిగిన దిరుగుగాకేమియు
త్రిమ్మటమ్మృగములు దిరుగవెటు
కుడుపుదానుడిగిననుడుగు గాకేమియా
కుడుపు పరాకేయులుడుగవెట్లు
ఆకాశచరుడైననగుగాక నేమియో
యాకాశమున బక్షులెగురవెట్లు

గాన భక్తిహీనుడైనవాడెంతవా
డైన వాని విద్యమానుషంబు
లెల్లమిథ్యగాదె యేకామ్రగురుచిత్త
నలిన భృంగసోమనాథలింగ!
(అన్యవాదకోలాహలము - 'విక్రమనాథుడు)

శాస్త్రములు చదివినను చిలుకపలుకులవలెనుండినచో అగారు. భూమియంతయు తిరిగి తీర్థాటనము చేసినమాత్రాన ప్రయోజనములేదు. మృగములు చాలదూరము తిరుగుటలేదా! హృదయమునందు భక్తిభావము కలుగవలయుననుట. చిత్తము పరమేశ్వరాయత్తముగాక భోజనము మానినను నప్రయోజనమె. యోగాభ్యాసము చేసి విహంగ యానము నలవరచుకొనినంత మాత్రాన సిద్ధించెనందుమా? భక్తిలేనివాడెంతటివాడైనను లాభములేదు. వానికెన్ని విద్యలు వచ్చినను అవియన్నియు మానుషములగుటచే మిథ్యయే.

# శ్రీ వల్లభ చరితామృతం

అనే

(శుద్ధాద్వైతదర్శనం)

*మూలం : శ్రీ కళాధర్‌భట్*
*తెలుగు రచన : అక్కిరాజు రమాపతిరావు*

## శ్రీవల్లభ జీవిత సంగ్రహం

ఇప్పటి ఆంధ్ర దేశంలో కృష్ణానది దక్షిణతీరాన కాకరవాడ అనే ఊరుంది. దీన్నే కకుంభ పురమని కూడా అనే వాళ్ళు ఇది కొంచెం పెద్ద ఊరేనని చెప్పాలి. శ్రీవల్లభాచార్యుల పూర్వీకులు ఈ గ్రామం నివాసస్థలంగా కలవాళ్ళు. ఈ వంశీకులది భారద్వాజస గోత్రం వాళ్ళు వైష్ణవసంప్రదాయ పరులుగా ఉండేవారని తెలుస్తున్నది. ప్రామాణికమైన వీరవంశ చరిత్ర ఈ వంశంలో శ్రీగోవిందాచార్యుల వారి కాలం నుంచి మాత్రమే తెలుస్తున్నది. విఖ్యాతకీర్తినార్జించిన శ్రీయజ్ఞనారాయణభట్టు అనే మహనీయులకు శ్రీ గోవిందాచార్యుల వారు ముత్తాత అవుతారు. శ్రీయజ్ఞనారాయణభట్టు పుత్రులు శ్రీవల్లభదీక్షితులవారు, (శ్రీయజ్ఞనారాయణ భట్టు శ్రీవల్లభాచార్యుల వారి ఆరో తరం మూల పురుషుడు) గృహస్థాశ్రమంస్వీకరించే ముందు బ్రహ్మచర్యా శ్రమవిధులను చక్కగా అనుపాలనం చేశారు. ఆయన ఎన్నో సార్లు సోమయజ్ఞాలు నిర్వహించారు. వేలకొద్దీ బ్రాహ్మణులకు అమిత మైన ధనరాసులను దక్షిణలుగా ఇచ్చి వారిని సంతృప్తి పరచారు. ఒకానొక సోమయాగ పరిపూర్తిసందర్భంగా ఒక హోమకుండంలో అర్చావిగ్రహరూపంలో మదనమోహనుడాయనకు సాక్షాత్కరించాడు. అప్పటి నుంచి ఆయన శ్రీ మదన గోపాలుణ్ణి తనజన్మసార్థక్య హేతువుగా కొలుచుకున్నారు. ఒకసారి ఈ మహాత్ముడి స్వప్నంలో నూరు సోమయజ్ఞాలు పూర్తి అయిన తర్వాత వీళ్ళవంశంలో దేవదేవుడు స్వయంగా ఉద్భవించనున్నాడని దివ్య వాణి విన్పించింది, అనే ఐతిహ్యం ఉంది. శ్రీయజ్ఞనారాయణభట్టు పుత్రులైన శ్రీగంగాధరభట్టు తమ జీవితకాలంలో 28 సోమయజ్ఞాలు నిర్వహించారు. ఇట్లా సోమయజ్ఞాలు నిర్వహించడమే కాదు, ఆయన మహావిద్వాంసుడుగా కూడా పేరు పొందారు. వీరి కుమారులైన శ్రీశ్రీగణపతిభట్టు కీర్తి ప్రతిష్టలు మరింత వాసికెక్కాయి. ఆయన మహాపండితులే కాకుండా గొప్ప వాదకౌశలం

కలవారు. ప్రతి పక్షులను నిరుత్తరులను చేయటంలో ఆయన ప్రజ్ఞ అసదృశం. మత సిద్ధాంతాలలోను తత్త్వవాదాలలోను పండితాగ్రేసరులుగా ఆయన ఆరోజుల్లో కీర్తి సాధించారు. ఒకసారి తంత్రవాద ప్రధానాచార్యులతో వాదించి వాళ్ళను ఓడించటంతో ఆయన ప్రఖ్యాతి మరింత ఇనుమడించింది. అంతే కాదు. తాంత్రిక సిద్ధాంత ప్రాచుర్యం వల్ల బలం కోల్పోయిన వేద మతసిద్ధాంతాలను ఆయన తన 'సర్వతంత్రనిగ్రహ' గ్రంథంద్వారా గట్టిగా పునరుద్ధరించి తంత్రవాదాన్ని రూపుమాపారు. తన జీవిత కాలంలో ఆయన 30 సోమయజ్ఞాలను నిర్వహించారు.

శ్రీగణపతి భట్టాచార్యుల వారి కుమారుడు శ్రీబాలభట్టు మహాశయుడు కూడా తండ్రి అంత పండితుడే. వైదిక మతాభిమానే. విశేషించి అంతగానూ భగవద్భక్తిపరాయణుడే. ఆయన 5 సోమయజ్ఞాలను పూర్తిచేసాడు. భగవదనుగ్రహంవల్ల ఆయన కిద్దరు కొడుకులు జన్మించారు. పెద్దవాడు శ్రీలక్ష్మణభట్టు. చిన్నవాడు శ్రీజనార్దనుడు. శ్రీలక్ష్మణభట్టు అనురూప కులగోత్రవయోశీల సంపల్లక్ష్మి అయిన శ్రీఎల్లమాంబను వివాహమాడాడు. ఆనాటి విభవోజ్జ్వల విజయనగర హిందూ సామ్రాజ్య రాజపురోహితులైన శ్రీసుశర్మాచార్యుల వారి తనయ ఎల్లమ్మగారు. శ్రీలక్ష్మణభట్టు గారు స్వగ్రామాన్ని విడిచి అక్కడికి సమీపంలో ఉన్న అగ్రహారంలో కొన్నాళ్ళు నివసించటానికి వచ్చినట్లు చెపుతారు. ఇందుకు కారణం దుష్టుడైన [illegible] వారి నివాస గ్రామాన్ని దురాక్రమించి నిర్మూలించడమే అని అంటారు. భారత దేశంలో సుప్రసిద్ధులైన వైదికమత ప్రస్థానాచార్యులైన ఐదుగురు మహనీయులలో ఒకరైన శ్రీవల్లభాచార్యులవారు శ్రీలక్ష్మణభట్టుగారికి జన్మించారు. శ్రీ వల్లభాచార్యులవారి పూర్వీకుల చరిత్రను బట్టి వారిదెంత మహామహిమాన్వితమైన పవిత్ర వంశమో వైదిక సంప్రదాయ నిరతి ఆవంశంలో ఎట్లా పరమోజ్జ్వలంగా వెలుగొందుతూ వచ్చిందో తెలుసుకోవచ్చు విశిష్టమైన వైదిక మతాభిమాన సంప్రదాయం పారంపర్యంగా వారి వంశంలో నెలకొని ఉన్నట్లు వారి వంశీకుల చరిత్ర వల్ల స్పష్టమే. ఈ వంశంలో దివ్యాంశగల మహాపురుషు లెందరో జన్మించారు. మహా మేధావులు, తత్త్వకోవిదులు, పరమ పవిత్రులు శతాబ్దుల తరబడి ప్రభవిస్తూ వచ్చారు. దీపంబువలన నొండొక దీపంబు ముట్టించినట్లు దివ్యజ్యోతులుగా కాంతులు ప్రసరింపచేశారు. కేవలం విద్వత్తు. శేముషీ సంపద మూర్తీభవించిన వారు కావటమే కాకుండా అనితరమైన సిరిసంపద పాడిపంటలతో ఓలలాడినవారు కావడం కూడా గమనార్హం. లేకపోతే అన్ని సోమయజ్ఞాలు ఎలా చేయగలుగుతారు! ?

ఒక కొడుకు, ఇద్దరు కూతుళ్ళు కలిగారు శ్రీలక్ష్మణభట్టుకు ఆయనకు లౌకిక జీవతంపట్ల వైరాగ్యం కలిగింది. తీర్థయాత్రపట్ల ఆసక్తి కలిగి భారత దేశంలోని పుణ్యక్షేత్రాలన్నీ పర్యటించ సాగారాయన. ఆయన మనస్సులో ఐహికేచ్ఛలపట్ల విరక్తి భావం నానాటికీ ప్రబలం కాజొచ్చింది. తీర్థయాత్ర ఇందుకు ఆలంబన మైంది. ఈ విధంగా కాలంగడుపుతుండగా కొంత కాలానికి ప్రభాకరభట్టు అనే సాధు పురుషుడు నీకు భగవంతుడు పుత్రుడుగా జన్మించనున్నాడని తెలియచేశాడు. అప్పుడిక లక్ష్మణభట్టు మళ్ళీగృహస్థుగా జీవించడం ప్రారంభించాడు. ఇల్లాలితో ఆయన పరమ పవిత్ర క్షేత్రమైన వారణాసిలో నివసించాడు. తన ఇతర సంతానం ఒక కొడుకు ఇద్దరు కూతుళ్ళను తన తమ్ముడైన జనార్ధన భట్టుకు అప్పగించాడు. జనార్ధనభట్టు స్వగ్రామంలోనే ఉంటూ వచ్చాడు. వారణాసిలో ఉంటూ ఉండగానే శ్రీ లక్ష్మణభట్టు సోమయజ్ఞాలు శత సంఖ్య పూర్తి చేశాడు. తమవంశంలో పూర్వీకుడైన శ్రీయజ్ఞనారాయణభట్టు ప్రారంభించిన సోమయాగక్రతువులు శ్రీలక్ష్మణభట్టు నాటికి శతసంఖ్యా పరిపూర్తికి చేరుకున్నాయి. ఈ విధంగా ఆవంశంలో నూరు సోమయజ్ఞాలుపూర్తి అయ్యే సరికి దైవనిర్ణయం ప్రకారం, ఎప్పుడెప్పుడు భగవంతుడు అవతరిస్తాడా అని అందరూ ఆత్రుతతో ఎదురుచూడసాగారు. తమ బంధుబలగం ఉంటూ ఉన్న హనుమాన్‌ఘాట్ సమీపంలోనే గంగాతీరంలోనే తమ నివాసం కూడా ఏర్పరచుకున్నారు లక్ష్మణభట్టు. ఆదంపతులు ఆనందంతో గడపసాగారు. లక్ష్మణభట్టు పండితులతో మత వేదాంత చర్చలు చేస్తూ భగవంతుణ్ణి ఆరాధిస్తూ తన సమయమంతా గడపటం సాగించాడు. ఈ విధంగా కాలంగడుపుతూ ఉడటం ఆయనకు తృప్తిని ఆనందాన్ని కలిగించింది. అయితే ఆయన మనశ్శాంతికి ఇంతలోనే విఘాతం సంభవించింది. వారణాసిలో విషాద మేఘాలు అలము కొనజొచ్చాయి. ఆ రోజుల్లో ఢిల్లీని పరిపాలిస్తున్న బెహలోల్‌లోడికీ వారణాసికి సమీపంలోనే ఉన్న జాన్‌పూర్‌లో రాజప్రతినిధిగా ఉన్న హుసేన్‌అలీకి మధ్య వైషమ్యం రాజుకోవటం మొదలై వాళ్ళ మధ్య యుద్ధం ప్రారంభమైంది. పర్యవసానంగా వారణాసిపై ముస్లింసైన్యాలు తీవ్రంగా దండయాత్ర చేసికొల్లగొడతాయనీ, దేవాలయాలను ధ్వంసంచేసి దోచుకుంటాయని, బ్రాహ్మణులకు ముఖ్యంగా దాక్షిణాత్య బ్రాహ్మణులకు సర్వనాశనం తప్పదని భీతావహంగా ఎన్నెన్నోపుకార్లు ఎప్పటి కప్పుడు వ్యాపిస్తూ ఉండేవి. అందువల్ల హిందువులు ముఖ్యంగా దాక్షిణాత్య బ్రాహ్మణులు ప్రాణాలుగ్గబట్టు కొని భయం భయంగా తమస్వస్థలాలకు పారిపోవడం ప్రారంభించారు. ఆ పవిత్రక్షేత్రమంతా అల్లకల్లోలంకా జొచ్చింది. అప్పటికే లక్ష్మణభట్టార్యుని ఇల్లాలు నిండు నెలల చూలాలు. ఆయనగారి కేమీతోచలేదు. తమ ప్రాంతాల

నుంచి వచ్చి కాశీలో స్థిరపడిన వాళ్ళంతా శరణార్థులై, కాందిశీకులై వారణాసిని విడిచివెళ్ళుతున్నారు. ఇటువంటి పరిస్థితులలో ధైర్యం చేసి ఇక్కడ ఉండటం మంచిదికాదని భావించి తానుకూడా నిండుపొద్దుల ఇల్లాలితో శ్రీలక్ష్మణభట్టు దక్షిణాదికి వెళ్ళి అక్కడే కాలంగడిపే ఉద్దేశంతో పారిపోతున్న బంధు బలగంతో తాను బయలుదేరాడు. అప్పట్లో ఇప్పటి లాగా ప్రయాణ సౌకర్యాలు లేవు. అడుగేకోసెడులాగా సాగాల్సి వచ్చేది. పైగా నిండు గర్భవతి ఇల్లాలు. ప్రయాణం మహాకష్టంమీద ముందుకు సాగేది. వాళ్ళు ఎలాగో చంపారణ్యందాకా చేరుకున్నారు. ఇక ఒక అడుగు కూడా ముందుకు సాగ లేనని చెప్పింది ఎల్లమ్మగారు. ఇన్నాళ్ళు ప్రయాణంచేసి ఆమె చాలా బడలిక పొందింది. మార్గమధ్యంలో వాళ్ళకు సరైన తిండి తిప్పలు కూడా లేక పోయినాయి. అదీకాక ముందేం జరగబోతున్నదో అని ఆందోళన. ఈ పరిస్థితులలో ఆమెకు పురిటి నొప్పులు ప్రారంభమైనాయి. అది కటికి చీకటి రాత్రి. వాళ్ళు ఒక జమ్మి చెట్టు కింద విడిది చేశారు. అది విక్రమ శకం 1529 (1473 క్రీ.శ.) ఆ రాత్రి జమ్మి చెట్టు కింద ఆమెకు పురుడొచ్చింది., నెలలు నిండకుండానే పురుడొచ్చింది అని ఆమె అనుకున్నది. శిశువులో ఎటువంటి చలనమూ లేదు. చైతన్యం లేదు. అందువల్ల ఆశిశువు నెలలు నిండకుండానే జన్మించాడని వాళ్ళు భావించి జాగ్రత్తగా ఒక గుడ్డలో చుట్టి ఆ చెట్టు కిందనే వదలిపెట్టి ముందు సాగిన తమ జట్టు శరణార్థులను కలుసుకోవాలని వాళ్ళు ఆ రాత్రికి రాత్రే చీకట్లోనే బయలు దేరి పయనం సాగించారు. అక్కడికి దగ్గరలోనే ఉన్న చిన్నపల్లె చేరి తమకు ముందు బయలు దేరిన వాళ్ళను కలుసు కున్నారు. వాళ్ళప్పటికి గాఢ నిద్రలోమునిగి ఉన్నారు. వీళ్ళు కూడా ఒక కునుకు తీద్దామని నడుంవాల్చారు. అయితే శ్రీ లక్ష్మణభట్టుగారూ, ఎల్లమ్మగారూ ఎవరికి వారుగా ఒక దివ్యవాణిని విన్నారు. భగవంతుడే తమకాదివ్య సందేశం విన్పిస్తున్నట్టుగా వాళ్ళకు అనిపించింది. "నేను జన్మించాను. నెలలు నిండకుండ పుట్టానని మీరనుకొన్న ఆశిశువునేనే. ఆ జమ్మిచెట్టు కిందమీరు వదిలి వచ్చారే ఆనిసుగునునేనే" ఈ మాటలు వినటంతో నే ఆదంపతులు పరుగు పరుగున మళ్ళీ ఆ జమ్మిచెట్టు దగ్గరకు చేరారు. వాళ్ళు వెళ్ళేప్పటికి మహాద్భుతమైన దృశ్యంవాళ్ళకు నయనగోచరమైంది. ఆ దివ్య శిశువు చుట్టూ అగ్ని పరివేష్టించి అతణ్ణి కాపాడుతోంది. ఎల్లమ్మగారు ఇక ఆగలేక పోయింది. ఆమెలో మాతృత్వం ఉబికివచ్చింది. ఆ పిల్లాడికి స్తన్యం ఇవ్వాలని తహతహలాడింది. ఆ అగ్నితనను ఏమీచేయదని ఆమె సంభ్రమంతో ఆపిల్ల వాణ్ణి ఒళ్ళోకి తీసుకుని గుండెలకు పదేపదే హత్తుకొని ముద్దులతో ముంచెత్తింది ఆ పసికందును. "నా వల్లభ, నావల్లభ (ప్రాణప్రదుడా, రక్షకుడా) " అని పదే పదే మురిసి పోయింది. తల్లి మొదటి సారి ఆయన్ను

ఏమనిపిలిచిందో అదే తర్వాత ఆయన పేరైంది. పెరిగి పెద్దైన తర్వాత ఆయన శ్రీవల్లభాచార్యులైనారు.

## శ్రీవల్లభ జీవిత సంగ్రహం

ఆ దంపతులు ఆపొత్తిళ్ళ పసిపాపణ్ణి తీసుకొని చంపారణ్యా పట్టణానికి చేరుకున్నారు. అప్పుడా నగరంలో శ్రీకృష్ణదేవుడనే ఆయన ప్రధాన నగరాధికారిగా ఉన్నారు. వెనక ఒక సారి ఈ శ్రీకృష్ణదేవుడు శ్రీలక్ష్మణభట్టుగారి అనుగ్రహం అర్థించి ఆయన ఆశీస్సులతో ఆయనను సేవించుకున్నారు. ఈ విధంగా శ్రీలక్ష్మణభట్టు ఆశీస్సులతో ఆయన తన సంతాన హీనతను కూడా పోగొట్టు కున్నాడు. తనకు కొడుకు కలగటం ఆపుణ్యాదంపతుల అనుగ్రహ ఫలమనే విశ్వాసంతో ఉన్నవాడాయన. ఆ శ్రీకృష్ణదేవుడు పొత్తిళ్ళ నిసుగుతో వచ్చిన ఆపుణ్యా దంపతులను ఎంతో భక్తి తాత్పర్యంతో ప్రేమాభిమానాలతో స్వాగత సత్కార సహితంగా తమ ఇంట్లో ప్రవేశ పెట్టాడు. తన తోనే ఎప్పటికీ ఉండి పోవాల్సిందని వాళ్ళను ఎంతగానో ప్రార్థించాడు. అట్లా చంపారణ్యంలో కొన్నాళ్ళున్న తర్వాత శ్రీలక్ష్మణభట్టుకు కాశీలో ఉపద్రవం అంతా తొలగి పోయి ప్రశాంత పరిస్థితులు నెలకొన్నాయని తెలిసింది. అప్పుడిక దక్షిణాదిన తమస్వగ్రామానికి వెళ్ళాలనే ఆలోచన ఆయన విరమించుకున్నాడు. మళ్ళీ కాశీకిచేరి అక్కడే నివసించాలన్న కోరిక ఆయనకు కలిగింది. ఆయన మళ్ళీ కాశీ చేరుకున్నారు. హనుమాన్‌ఘాట్ లో మళ్ళీ అదే ఇంట్లో ప్రవేశించి ఇల్లాలితోను. పిల్లావాడితోను ఆయన సుఖంగాకాలం గడపసాగారు.

శ్రీవల్లభాచార్యులు ప్రభవించటానికి కొన్ని రోజులు ముందుగా గోవర్ధనగిరి శిఖరిపై శ్రీనాధుడి (బాలకృష్ణుడు) వరదహస్తం దర్శనం ఇచ్చినట్లు చెపుతారు. శ్రీవల్లభాచార్యులు జన్మించిన ఆ రోజున శ్రీనాథుని దివ్యావతార అర్చావిగ్రహ జగన్మంగళ శోభావదనం, ఆయన చేతితో పాటుగా పొడకట్టినట్లుగా కూడా ఐతిహ్యం ఉంది. పుష్టిమార్గానుయాయుల నమ్మకం ఏమంటే శ్రీ కృషపరబ్రహ్మ దివ్యవదనావతారుడే శ్రీవల్లాభాచార్యులవారని. అంటే శ్రీ కృష్ణపరబ్రహ్మ దివ్యమంగళవదనమే శ్రీవల్లభచార్యులుగా జన్మించటం జరిగిందని పుష్టిమార్గులు విశ్వసిస్తారు.

బాలవల్లభుడికి ఐదేళ్ళు వచ్చినసమయంలో శ్రీలక్ష్మణభట్టుగారికి ఇంకో పుత్రుడు కలిగాడు. ఆ పిల్ల వాడికి కేశవుడని పేరు పెట్టాడాయన.

శ్రీలక్ష్మణభట్టు స్వయంగా మహావిద్వాంసుడు కాబట్టి అతి చురుకైన తెలివి తేటలుగల బాలవల్లభుడి విద్యాభ్యాసంపట్ల ఆయన మిక్కిలి శ్రద్ధ చూపుతూ తామేచదువు చెప్పసాగారు. వల్లభుడు ఐదో ఏటనే ఆయనకు గాయత్రీ మంత్రోపదేశం జరిగింది. తండ్రి గారే బాలవల్లభుడికి గాయత్రీమంత్రోపదేశం చేశారు.

సకల శాస్త్రాలలో వల్లభుడు నిష్ణాతుడు కావటానికి కాశీదివ్యావాసంలోని సుప్రసిద్ధ శాస్త్ర పండితుల వద్ద ఆయనకు శిక్షణ ఇప్పించాడు తండ్రి. ఒక్కొక్క ఆ చార్యుడి వద్ద ఆయన ఒక్కొక్క వేదాధ్యయనం చేసి పరిపూర్ణత సాధించాడు. షడ్దర్శనాలలోనే కాక, శంకర; రామానుజ, మధ్వ, నింబార్కాచార్యుల సిద్ధాంత దర్శనాలలో కూడా తల స్పర్శిపాండిత్యం సంపాదించాడు వల్లభుడు. బౌద్ధ,జైన మతాలను కూడా కూలంకషంగా ఆయన తెలుసుకున్నాడు. ఇదంతా ఆయన కౌమార వయస్సులోనే సాధించటం అద్భుతాలలో కెల్లా అద్భుతం. ఆయన బుద్ధికుశలత, ఆయన పాండిత్య వైభవంచూస్తుంటే ఆయన ఎప్పుడో గొప్పమతాచార్యుడుగా అనితరసాధారణమైన కీర్తి ప్రతిష్ఠలు పొందుతాడనీ, ఒక వేదాంత తత్త్వాన్ని నూతనంగా ఆవిష్కరించి పరమాచార్య పదవినధిష్టిస్తాడనీ తల్లిదండ్రులు సంబరపడుతూ ఉండే వాళ్ళు. అయితే శ్రీలక్ష్మణభట్టు ఆ సంతోషాన్ని అనుభవించ కుండానే దివికేగారు. శ్రీవల్లభుడికి పదకొండేళ్ళ వయసుననే శ్రీలక్ష్మణభట్టు స్వర్గస్థులైనారు.

*(సశేషం)*

# దైవభక్తి

"కష్టాలు తొలగించుకోటానికి చాలా శ్రమలు పడుతున్నాం. లౌకిక పరిహారాలు చేస్తున్నాం. ఆస్తికులైన వారు వైదిక కార్య కలాపాలతో లాభం పొందటానికి యత్నిస్తున్నారు. ఆపదలో నున్నప్పుడు నాస్తికుడు కూడా రహస్యంగానైనా ఆస్తిక పరిహారాలకై యత్నిస్తాడు. కాని, ఈశ్వరభక్తి చిత్త శుద్ధితో అలవరచుకొన్న వాడు ఏ పరిహారాలు లేకుండానే అన్ని ప్రయోజనాలను పొందుతాడు. పెద్ద మానును ఇటు అటు లాగాలంటే దానికి ఏనుగును కట్టిలాగించాలి. అదే మాను మహాప్రవాహంలో ఒకప్పుడు తేలికగా కొట్టుకు పోతుంది. అలాగే పరమేశ్వరభక్తి ప్రవాహం మనలో పెల్లుబుకుతూంటే మహాకష్టాలనే ఈ దుంగలు తేలి, వాటంతటవే కొట్టుకుపోతవి"

*- శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి.*

# గురుశిష్య సంబంధం

డా. శ్రీతిరుమల రామచంద్ర

*పుత్రమివైన మనకాజ్క్షన్ సర్వధర్మే ష్వనవ*
*చ్ఛదయమానఃసుయుక్తో విద్యాంగ్రాహయేత్.*

*ఆపస్తంబధర్మ సూత్ర ప్రశ్న-1 పటలం-2-25*

తనపుత్రుని ఉన్నతిని కాంక్షించినట్లు శిష్యుని ఉన్నతిని కాంక్షించాలి. ఏధర్మం విషయంలోను దేనినీ కప్పి పెట్టరాదు. చాలశ్రద్ధతో చదువు చెప్పాలి.

*నచైన మధ్యాऽపన విఘ్నేన ఆత్మరేషు ఉపరున్ధ్యాత్ అనాపత్సు. 26.*
ఆపత్తి ఏర్పడినప్పుడు తప్ప తక్కిన సమయాలలో శిష్యుని చదువుకు భంగం కలిగించే విధంగా తన పనులకు వినియోగించుకోరాదు.

***అపరాధేషు చైనం సతత మపాలభేత. 29.***
శిష్యుడు తప్పుచేసినప్పుడు తప్పు తెలిసి చీవాట్లు పెట్టి హెచ్చరించాలి. శిష్య శిష్టిః అవధేన.

*గౌతమధర్మసూత్ర ప్రశ్న1, అధ్యాయం 2-48*

శిష్యుణ్ని కొట్టకుండ కేవలం తిట్టి బెదరించి సరైనమార్గంలో పెట్టాలి.

***అశక్తౌ రజ్జు, వేణు విదాలాభ్యాం తనుభ్యాం 49***
తిట్లతో పనిజరుగనపుడు సన్నని పగ్గం తోగాని, వెదురు బద్దతోగాని నెమ్మదిగా కొట్టాలి

***శిష్యాంశ్చ శిష్యాద్ ధర్మేణ వాగ్బాహూదర సంయాతః***

*మనుస్మృతి4-175*

నోరు, చేయి, కడుపు ఈ మూడింటిని అదుపులో పెట్టుకొని అంటే అవసరమైన మాటలు మాటాడకుండా చేతులతో ఎవరికి బాధకలిగించ కుండా ఇష్టం వచ్చి నట్టు ఏమీతినకుండా, ధర్మోక్త విధితో శిష్యులను శిక్షించాలి.

***ఆచార్యో మధురై ర్వాక్యైః సాభిప్రాయవలోకనైః***
***శిష్యం శిష్యాత్ ననిర్లజ్జం కుర్యాద్ బంధనతాడనైః***
***మస్తకే హృదయేవాః ప్రాజ్ఞః ఛాత్రంనతాడయేత్***
***అధోభాగే శరీరస్య పునఃకిఞ్చిన శిక్షయేత్.***

*శివతత్త్వ రత్నాకరం-2-7-7*

ఆచార్యుడు తియ్యని మాటలతో, ఇంగితం తెలిపే చూపులతో శిష్యుణ్ణి శిక్షించాలిగాని, కట్టి, కొట్టి, నిర్లజ్జుణ్ని చేయరాదు, అలా కొడితే వాడిని సిగ్గు పడేట్లు చేయరాదు. సిగ్గులేని వాడులా ప్రవర్తించేట్లు చేయరాదు. శిష్యుణ్ని కొట్టవలసివస్తే, తలమీద, రొమ్ము మీద కొట్టరాదు. దేహం కిందిభాగం మీద కొద్దిగా కొట్టాలి. పిదప చదువు చెప్పాలి.

*విద్యార్థీ బుద్ధిరహితో చల్పేన యది చేష్టయా,*
*కృత్యాకృత్య పరిజ్ఞాన వైకల్పేనచ మౌర్ఖ్యతః*
*అశ్రుతం దుశ్రుతంవాపి పారుష్యం దుష్టభాషితం*
*అకార్యమనృతం ఫల్గు వాక్యం తుచ్ఛప్రభాషణం*
*కుర్వన్నపి ననిగ్రాహ్యో జ్ఞప్తిఃయా వధ్వ వేదనే*
*స్వపుత్రవద్ రక్షణీయః షోడశాబ్దాత్ పరంతుచేత్*
*నిగ్రావ్యాస్యాన్న చేన్మానం శిక్ష్యాపాల్యః సదైవహి*

*మార్కండేయస్మృతి-బ్రహ్మచారిధర్మప్రకరణం*

విద్యార్థి బుద్ధిహీనుడు కావడం వల్లనో, పిల్లతనంవల్లనో, బాల్య చేష్టల వల్లనో, ఉచితానుచితాలు తెలియనందు వల్లనో, మూర్ఖత్వంవలననో గురువు మాటలను వినకపోయినా, సరిగావినకపోయినా, ఒక దాని కొకటి అర్థం చేసుకొన్నా, పరుషంగా మాట్లాడినా, చెడ్డమాటలు చెప్పినా, అనుచితమైన పనులు చేసినా, అబద్ధాలు చెప్పినా, సారంలేని, తుచ్ఛమైన మాటలన్నా, అప్పటికీ గురువు అతనిని దండించగూడదు. మిదుమిక్కిలి జ్ఞానం వచ్చేవరకు పుత్రుని సమానంగా చూడాలి, కాని, 16 సంవత్సరాల పిదపకూడ అతడు సరిపోకపోతే, అప్పుడు శిక్షించాలి, అప్పుడూ వాడు సరైన దారికి రాకపోతే, నిరంతరం అతనిని పాలించాలి.

*విద్యార్థి గురువుల ఎడల ప్రవర్తించ వలసినతీరు:-*

***ఆచార్యాధీనః స్యాదన్యత్ర పతనీయేభ్యః***

*ఆపస్తంభ -ప్రశ్న-1 పటలం1-2*

అనుచిత విషయాలుమినహాగా శిష్యుడు తక్కిన అన్ని విషయాలలోను తాను గురువును అనుసరించి ప్రవర్తించాలి.

**గురువులు కూడ ఇలాగే చెప్పాలి :**

*యాన్యస్మాకం సుచరితాని, తనిత్వయోపాస్యానినో ఇతరాణి.*

*తైత్తిరియోపనిషత్ 1-10-2*

మానుంచి చరితాన్ని, ఆచరణను మాత్రమే మీరు అనుకరించండి చెడ్డవాటిని అనుకరించవద్దు.

***హితకారీగురోః అప్రతిలోమ యన్ వాచా.***

*ఆపస్తంబ-2-2*

శిష్యుడు గురువు హితం చూడాలి అతని మాటలకు ఎదురాడకూడదు.

***గురోః ఉదాహారేషు అకర్తా స్వైరకర్మాణి***

గురువు నిత్యకృత్యాలు-కూర్చోడం, పడుకోడం తిరగడం మున్నగు పనులు చేసేచోట తనపనులు చేయరాదు.

*నచాస్య సంవిష్టోభాషేత*
గురువువద్ద కూర్చొని మాట్లాడరాదు. నిలబడి మాట్లాడాలి.

***అభిభాషితస్తు ఆసీనః ప్రతి బ్రూయాత్***
గురువు పలుకరించి కూర్చోమంటే కూర్చొని మాట్లాడాలి.

***తిష్ఠతిచన ఆసీత.***
గురువు నిలుచున్నప్పుడు కూర్చోరాదు.

***ఆసీనేచన నసంవిశేత్***
గురువుకూర్చున్నప్పుడు, శిష్యుడు అతనివద్ద పడుకోరాదు.

*(సశేషం)*

### శ్రీశంకర భగవత్పాదవిరచిత

# శ్రీకనకధారాస్తవము

1. అఙ్గంహరేః పులక భూషణమాశ్రయన్తీ
భృఙ్గాఙ్గనేవ ముకుళాభరణంతమాలమ్
అఙ్గీకృతాఖిల విభూతిరపాఙ్గలీలా
మాఙ్గల్య దాస్తుమమమంగళ దేవతాయాః

2. ముగ్ధాముహుర్విదధతీ వదనేమురారేః
ప్రేమ త్రపాప్రణిహితాని గతాగతాని
మాలాదృశోర్మధుకరీవమహోత్పలేయా
సామేశ్రియం దిశతు సాగర సంభవాయాః

3. విశ్వామరేంద్ర పదవిభ్రమ దానదక్ష
మానంద హేతురధికం మురవిద్విషోపి
ఈషన్నిషీదతుమయిక్షణ మీక్షణార్ధ
మిందీవరోదర సహోదరమిందిరాయాః

4. ఆ మీలితా క్షమధిగమ్యముదా ముకున్ద
ఆకేకరస్థిత కనీనెక నేత్రపక్ష్మ
మానందముద్రమనిమేషమనఙ్గతన్త్రమ్
భూత్యైభవేన్మమభుజఙ్గశయాఙ్గనాయాః

5. కాలాంబుదాళిలలితోరసికైటభారేః
ధారాధరేస్ఫురతి యత్తటిదంగనేవ
మాతుస్సమస్త జగతాంమహనీయమక్షి
భద్రాణి మేదిశతు భార్గవనందనాయాః

6. బాహ్యాంతరేమధు జితశ్శ్రిత కౌస్తుభాయా
హారావళీవ హరినీలమయీవిభాతి
కామప్రదా భగవతోపి కటాక్షమాలా
కల్యాణ మావహతుమే కమలాలయాః

7. ప్రాప్తమ్పదమ్ప్రథతః ఖలుయత భావాత్
మాఙ్గల్యభాజి మధుమాథిని మన్మథేనమ్
మయ్యాపతేత్త దిహమందర మీక్షణార్థమ్
మందాలసంచమకరాలయ కన్యకాయాః

8. దద్యాద్దయాను పవనోద్రవిణాంబుధారా
మస్మిన్నకించన విహంగశిశౌ విషణ్ణే
దుష్కర్మఘర్మమపనీయచిరాయదూరమ్
నారాయణప్రణయినీ నయనాంబువాహః

9. ఇష్టా విశిష్టమత యోపి యయాదయార్ద్ర
దృష్ట్యాత్రివిష్టపపదం సులభం లభంతే
దృష్టిః ప్రహృష్ట కమలోదర దీప్తిరిష్టామ్
పుష్టింకృషీష్టమమ పుష్కరవిష్టరాయాః

10. గీర్దేవతేతి గరుడధ్వజ సుందరీతి
శాకంభరీతి శశిశేఖర వల్లభేతి
సృష్టిస్థితి ప్రళయకేళిషు సంస్థితాయాః
తస్యైనమః స్త్రిభువనైకగురోస్తరుణ్యై

11. శ్రుత్యై నమోస్తు శుభకర్మఫలప్రసూత్యై
రత్యై నమోస్తురమణీయ గుణార్ణవాయై
శక్త్యై నమోస్తు శతపత్రనికేతనాయై
పుష్ట్యై నమోస్తు పురుషోత్తమ వల్లభాయై

12. నమోఽస్తునాళీకనిభాననాయై
నమోఽస్తుదుగ్ధోదధి జన్మభూమ్యై
నమోఽస్తుసోమామృతసోదరాయై
నమోఽస్తునారాయణవల్లభాయై

13. నమోఽస్తు హేమాంబుజపీఠికాయై
నమోఽస్తు భూమండలనాయికాయై
నమోఽస్తు దేవాదిదయాపరాయై
నమోఽస్తు శార్ఙ్గాయుధవల్లభాయై

14. నమోఽస్తు దేవ్యై భృగునందనాయై
నమోఽస్తు విష్ణోరురసిస్థితాయై
నమోఽస్తు లక్ష్మ్యై కమలాలయాయై
నమోఽస్తు దామోదర వల్లభాయై

15. న మోస్తుఽకాన్త్యైకమలేక్షణాయై
న మోస్తుఽభూత్యై భువనప్రసూత్యై
న మోస్తుఽదేవాదిభిరర్చితాయై
న మోస్తుఽనందాత్మజ వల్లభాయై

16. సంపత్కరాణి సకలేంద్రియనందనాని
సామ్రాజ్యదాన విభవాని సరోరుహాక్షి
త్వద్వందనాని చరణాభరణోద్యతాని
మామేవ మాతరనిశంకలయంతుమాన్యే

17. శ్రీకటాక్ష సము పాసనావిధిః
సేవకస్య సకలార్థ సంపదః
సంతనోతి వచనాఙ్గమానసైః
త్వాంమురారిహృదయేశ్వరీంభజే

18. సరసిజ నయనే సరోజహస్తే
ధవళతమాంశుక గంధమాల్యశోభే
భగవతిహరివల్లభే మనోజ్ఞే
త్రిభువన భూతికర ప్రసీదమహ్యామ్

19. దిగ్ఘస్తిభిః కనకకుంభముఖావసృష్ట
స్వర్వా హినీవిమల చారుజల ప్లుతాఙ్గీమ్
ప్రాతర్నమామి జగతాంజననీ మశేష
లోకాధి నాథ గృహిణీమమృతాబ్ధి పుత్రీమ్

20. కమలే కమలాక్ష వల్ల భేత్వం
కరుణాపూరతరఙ్గి తైరపాఙ్గైః
అవలోకయ మామకించనానామ్
ప్రథమమ్పాత్ర మకృత్రిమందయాయాః

21 స్తువన్తి యేస్తుతి భారమీభిరన్వహమ్
త్రయీమయీంత్రి భువనమాతరంరమామ్
గుణాధికాబహుధనధాన్య సమృద్ధో
భవన్తి తేభువి బుధ భావితా శయాః

22. సువర్ణధారాస్తోత్రం యచ్ఛంకరాచార్య నిర్మితమ్
త్రిసంధ్యం యః పఠే దేత తత్సకు బేరసమో భవేత్

ివిశ్వప్రకాశం

Endowments Department,
A.P., Hyderabad.

-12-1994.

ents - Religious - Sri Sarvartha Samkshema
Hyderabad - commendation of monthly maga-
ıwa Prakasham Reqested - Orders - Issued.

-11-94 from P.V. Manohar Rao.

er cited is herewith communicaed to all the
ndowments Department and Executive Offic-
for necessary action.

nissioners, Endowments Department are also
instructions to all the Executive Officers of 6
risdictions.

THE COMMISSIONER"

Sd/- R.S. Rama Moorthy,
I/c Assistant Commissioner (H.O)

Superintendent.

ioners, Endowments Department, Kakinada,
l, and Hyderabad.

6 (a) Institutions.
ohar Rao, Chairman, Sarvartha Sankshema
ı Sri Vishwayogi Vishwmji Hon,y President,
artments, Gandhinagar, Hyderabad.

Sr. 16/12/94.




న్యూఢిల్లీ 15-9-1995 న A.P.Bhavan లో సర్వార్థ సంక్షేమ సమితి,
హైదరాబాద్‌వారు నిర్వహిస్తున్న విశ్వశాంతి ఆధ్యాత్మిక విలువలు అనే మూడు
రోజుల సదస్సులో భాగంగా మొదటిరోజు అఖిలభారత ఆగమసదస్సునుజ్యోతి
వెలిగించి ప్రారంభిస్తున్న కేంద్ర జలవనరుల మంత్రిశ్రీరంగయ్యానాయుడు,
సర్వార్థ సంక్షేమ సమితి అధ్యక్షులుశ్రీ పి.వి.మనోహర్‌రావు,
భగవాన్ శ్రీశ్రీశ్రీ విశ్వయోగి విశ్వంజీ మహరాజ్




15-9-95 న ఆగమన సదస్సులో శ్రీ రంగయ్యానాయుడుగారు
శ్రీ కుర్తాళం స్వామీజీ, శ్రీ విశ్వంజీ మరియు పి.వి.మనోహరరావు




ఆలయములు వేరైనా ఆరాధకుడొక్కడే. మతాలు వేరైనా ఆశయం ఒక్కటే.

మానవతే మానవుని ప్రథమ కర్తవ్యం.

**BOOK POST** Printed Matter

To

1571 349 Sri. Dr. B. Rama Raju
1-8-117/2,
Chikkad Pally,
Hyderabad-20.

*If underlivered please return to,*
SARVARTHA SANKSHEMA SAMITHI
501, Pradeep Apartments, Gandhinagar. Hyd-38.

Edited, Printed & Published by Sri P.V. Manohara Rao, Sarvaardha Sankshema Samithi, Hyderabad-20.
Designed at *Advanced Graphic Systems*, Hyd-20,